# రిజర్వేషన్లు
# హిందూమతోన్మాదం



కత్తి పద్మారావు

లోకాయత ప్రచురణలు

రిజర్వేషన్లు హిందూమతోన్మాదం

రచయిత :

కత్తి పద్మారావు

హక్కులు - రచయితవి

ప్రచురణ - లోకాయత గృహగ్రంథాలయ సంస్థ, పొన్నూరు

మొదటి ప్రచురణ - మార్చి 1, 1991



ప్రతులు - **2000**

**వెల 8 రూపాయలు**

ముఖచిత్రం - మోహన్

కాపీలకు

కె. చార్వాకుడు
లోకాయత ప్రచురణలు
పొన్నూరు - 522 124
గుంటూరు - జిల్లా

డా॥ పి. భాస్కరరావు
2/5 బ్రాడీపేట
గుంటూరు

ముద్రణ : సృజన ప్రింటర్స్ - పొన్నూరు

# ముందు మాట

ఈనాడు భారతదేశాన్ని కుదిపివేస్తున్న ప్రధాన సమస్యలను ఈ పుస్తకంలో విశ్లేషించాను.

రిజర్వేషన్ల వెనుకవున్న సామాజిక భూమికను అర్థంచేసుకోవడానికి. హిందూ మతోన్మాదం వల్ల ముందుకు వస్తున్న ప్రమాదాన్ని అంచనావేయడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను.

ఇందులోని హిందూ మతోన్మాదుల చరిత్ర అనేభాగం 1983, 84 లోనే వ్రాశాను. అప్పుడు హేతువాదం పత్రికలో ఈ భాగం సీరియల్‌గా వచ్చింది.

దళితబలహీన వర్గాల ప్రజలు మైనారటీలతో కలసి సమైక్యంగా అగ్రవర్ణ హిందూ రాజ్యంపై పోరాడటానికి ఈ పుస్తకం సహకరిస్తే ఈ పుస్తక రచనకు నేను చేసిన ప్రయత్నం నెరవేరినట్లే.

లోకాయత గృహగ్రంథాలయ సంస్థ ద్వారా యీ పుస్తకాన్ని వెలువరిస్తున్నాము. త్వరలో అంబేడ్కర్ రచనలలో ముఖ్యమైనవి ఈ పథకంద్వారా వెలువరించబడతాయి. ప్రాచీన భారతదేశంలో స్త్రీ ముద్రిణలో వుంది. సామాజక విప్లవాన్ని విజయవంతం చేయడానికి లోకాయత గృహగ్రింథాలయ సంస్థ ద్వారా దళితుల చరిత్రి, సాహిత్యాలను వెలువరించడానికి ప్రయత్నం చేస్తున్నాం.

ఈ పుస్తకంలోని చివరి భాగాన్ని వ్రాయడానికి సహకరించిన వినయ్, సుబ్బారావులకు అభినందనలు.

ప్రూఫ్‌లుచూసి అచ్చువేసిన చార్వాక, జాబాలిలకు అభినందనలు. ముఖ చిత్రాన్ని గీసిన ప్రముఖ ఆర్టిస్ట్ మోహన్‌గారికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలోని అభిప్రాయాలతో ఏకీభవించేవారు, ఏకీభవించనివారు యదేచ్ఛగా మీ అభిప్రాయాలను రచయితతో చర్చించవచ్చు.

రచయిత

# విషయ సూచిక

ఈనాడు భారతదేశాన్ని అతలాకుతలం చేస్తున్న ముఖ్య సమస్యల్లో రిజర్వేషన్ల సమస్య ఒకటి. అందునా, భారతీయ సమాజానికి నిర్మాణ కర్తలైన వెనుకబడిన తరగతుల వారికి కేంద్ర ప్రభుత్వ సర్వీసుల్లో రిజర్వేషన్లు కల్పిస్తామని ప్రధాన మంత్రి శ్రీ వి. పి. సింగ్ ది. 7-8-90న చేసిన ప్రకటనతో రేగిన రిజర్వేషన్ల సమస్య అందర్నీ ఆలోచింప జేసేదిగా ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.

43 సంవత్సరాల స్వతంత్ర భారత సంక్షేమ రాజ్యంలో ఏ రాయితీకి నోచుకోని శ్రమజీవులైన ఇతర వెనుకబడిన తరగతులకు విద్యా ఉద్యోగ రంగాల్లో రిజర్వేషన్లు కల్పిస్తామని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలో యెప్పుడు ప్రకటించినా ఈ సంక్షోభం తప్పటం లేదు. అసలు బి. సి. లు అంటే ఎవరు? వారికి రిజర్వేషనులు ఎందుకు కల్పించాలి? మండల్ కమీషన్ నివేదికలో నివేదించిన దేమిటి? దళిత క్రైస్తవులను షెడ్యూల్డు కులాల్లో ఎందుకు చేర్చాలి? అనే అంశాలు ప్రజలకు అవగతంకాక పోవటం వల్లనే అగ్రకుల పెత్తందార్లు సృష్టిస్తున్న ఈ గందర గోళాన్ని వీరు ప్రేక్షకుల్లా నివ్వెరబోయి చూస్తున్నారు. ఈ సంక్షోభాన్ని సృష్టిస్తున్న శక్తులు సాంఘిక, సాంస్కృతిక ఆర్థిక రాజకీయ పెత్తనాన్ని భారతదేశంలో అవిచ్ఛిన్నంగా కొనసాగించు కొంటున్న శక్తులు. ఈ రిజర్వేన్లు భిక్షకాదు, మా హక్కు అని ప్రతిఘటించి యెదురు నిల్వవలసిన అవసరం బి. సి; యస్.సి;యస్. టి; మైనారిటీలకు చారిత్రకంగా ముందుకొచ్చింది.

## రిజర్వేషన్ల పూర్వరంగం

భారతదేశ స్వాతంత్ర్యమునకై ప్రాతినిధ్యం వహించిన అగ్రకుల నాయకవర్గం రాజ్యాధికారాన్ని, ఆర్థిక ఆధిపత్యాన్ని అగ్రకులాల వాళ్ళ సొంతం చేయటానికి ప్రయత్నించింది. ఈ నాయకవర్గం

భారతదేశ జనాభాలో 100కి 15 మందిగా వున్న వారికి మాత్రమే ప్రతినిధులు. 85 శాతంగా వున్న యస్. టి; యస్. సి; బి. సి; మైనారిటీ ప్రజలు అగ్రకుల పాలక వర్గాలకు పీడిత వర్గంగానే రూపొందారు. అత్యంత కీలకమైన ఆస్తి హక్కుని, రాజ్యాధికారాన్ని అగ్రకులాల వాళ్ళు హస్తగతంచేసుకున్నారు. పర్యవసానంగా విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక రంగాలపైన కూడా వారికి ఆధిపత్యం లభించింది. తరతరాలుగా ఆర్యులు, యవనులు, కుషానులు, అరబ్బులు, మొగలులు, ఆంగ్లేయుల చేత ఈపీడిత వర్గం పాలించబడ్డారు. తర్వాత వచ్చిన భారతదేశ అగ్రవర్ణాల పరిపాలనలో, అంతకు ముందు పాలించినవారి ఆర్థిక, రాజకీయ పీడనతో పాటు, యస్, టి; యస్. సి; బి. సి; మైనారిటీలపై సాంఘిక పీడన మరింతగా పెరిగింది.

ఆంగ్లేయులు భారతదేశ అగ్రకులాల వాళ్ళకు రాజ్యాధికారాన్ని కట్టబెట్టే దానికి చాలాకాలం ముందే మాంటేగ్యూ, ఛంస్ఫర్డు అను బ్రిటిష్ రాజ్యప్రతినిధులు భారతదేశవ్యాప్తంగా కులం కారణంగా వున్న సాంఘిక వెనుకబాటు తనాన్ని ఆధారం చేసుకొని, వారి అభివృద్ధికికొన్ని సంక్షేమ పథకాలను చేపట్టాలని, వారు ప్రకటించిన సంస్కరణల్లో సూచించారు. ఆ సూచనలు ఆధారంగా అణగదొక్కబడ్డ కులాల వారికి కొన్ని సంక్షేమ పథకాలు యేర్పరచబడినై. తరువాత 1935లో వచ్చిన నవభారతరాజ్యాంగ చట్టంలో ఈ సంక్షేమ పథకాలకు ''సాంఘికంగా వెనుకబడిన వారికి రిజర్వేషన్లు'' అని పేరు పెట్టబడినవి.

భారత స్వాతంత్రోద్యమ కాలంలోబడుగు వర్గాలకు రిజర్వేషన్లు ప్రతిపాదించటంలోను, సాధించటంలోను డాక్టరు బి. ఆర్. అంబేద్కర్ కృషి ప్రశంసించ దగింది. రౌండుటేబుల్ కాన్ఫరెన్సులోను, కమీషన్లకు సమర్పించిన రిపోర్టులలోను, అనేక సమావేశాలలోను ఆయన ఈ ప్రతిపాదనలనుచేస్తూ వచ్చారు. యస్.టి; యస్. సిల రిజర్వేషన్లు మాత్రంఅతికష్టం మీద రాజ్యాంగ బద్ధం చేయగలిగారు. అప్పటి పరిస్థితులలో బి. సి.

లకు రిజర్వేషన్లు రాజ్యాంగ బద్ధం చేయటం సాధ్యపడలేదు. జాతీయ నాయకులలో అగ్రగణ్యులైన తిలక్, గాంధీ, పటేలు. నెహ్రూ మొదలగు వారందరు బి. సి. లను హిందూ సమాజంలో భాగంగా పేర్కొంటూ వారిని ఆర్థిక సాంఘిక అభివృద్ధి విషయంలో నిర్మాణాత్మకంగా దూరం చేశారు. అప్పటికి బి.సి. లకు ఇది మన నాయకులు పాలిస్తున్న రాజ్యమే నన్న భ్రమ వుండేది.

నల్లదొరలకు రాజ్యం అప్పగించటానికి ప్రధానంగా కృషి చేసిన టాటా, బిర్లావంటి గుత్తపెట్టుబడిదారీ వర్గాలు చేతి వృత్తులలో ప్రతిభ, నైపుణ్యం కలిగి ప్రపంచవ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న వెనుకబడిన తరగతుల వారి జీవనవృత్తులన్నిటిపైన గొడ్డలి వేటువేసి వారిని జీవన భృతికి జోగులాడిసే దైన్యస్థితికి నెట్టి వేశారు. ఉదాహరణకు భారతదేశంలో అత్యంత వృత్తి నైపుణ్యము కలిగి ప్రపంచ ప్రఖ్యాతిబడసిన చేనేత కార్మికుల నాటి వైభవాన్ని నేటి దుస్థితిని చెప్పుకొనవచ్చును. ఇదే స్థితిని మిగతా గ్రామీణ చేతివృత్తులవారికి అన్వయించుకొనవచ్చును. చివరకు యస్. టి; యస్. సి; బి. సి; మైనారిటీలు సాంఘిక భద్రత, ఆర్థిక రాజకీయ రంగాలలో కనీస రాయితీలులేక జీవన సంక్షోభంలోనికి నెట్టబడ్డారు. 43 సంవత్సరాలు భారతదేశాన్ని యథేచ్ఛగా ఏలుకొంటున్న అగ్రవర్ణ పార్టీలు వాళ్ళ అధికారపీఠ ఆరోహణకు బి. సి. లను సోపానాలుగా ఉపయోగించుకొని, దళిత వర్గాలకు మేలు జరిగే సమయం వచ్చే సరికివాళ్ళ గుండెలలో మంటలు చెలరేపేకార్యక్రమాలను చేబడుతున్నారు.

మొదటి సారిగా రాజ్యాంగంలోని 340 అధికరణాను సారం రాష్ట్రపతి కాకాసాహెబ్ కలేల్కార్ కమీషన్‌ను వేశారు.

## కాకాసాహెబ్ కలేల్కార్ కమీషన్

1953లో నియమింపబడిన కాకా కలేల్కార్ కమిషన్ భారతదేశ వ్యాప్తంగా పర్యటించి సాంఘికంగా, విద్యా పరంగా వెనుకబడిన కులాల జాబితాను 2399గా తేల్చి 1955లో తమ నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించారు. అందులో షెడ్యూల్డు జాతులకు, కులాలకు ఇచ్చిన పద్ధతిలోనే విద్యా ఉద్యోగ రంగాలలో ఇతర వెనుకబడిన తరగతులకు రిజర్వేషన్లు కల్పించాలని ప్రతిపాదించారు. ఈ కమీషన్ నివేదికను భారత ప్రభుత్వం త్రోసిపుచ్చి ఆ తరువాత 5 సంవత్సరాలకు 1961 ఆగష్టు 14న కేంద్ర హోంమంత్రి రాష్ట్ర ప్రభుత్వాలకు కులాల ప్రాతిపదికగా వెనుకబడిన వారికి రాయితీలు కల్పించుకొనవలసిందిగా ఆదేశాలిచ్చి తన చేతులు కడుక్కున్నారు. ఈ అంశం భారత అగ్రకుల పాలకవర్గ స్వభావం బి. సి. లయెడ యెట్లావున్నది తెలియజేస్తున్నది.

అసలు భారత రాజ్యాంగం తొలి సవరణకు దారితీసిందే బి. సి. ల రిజర్వేషన్ల సమస్య. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో బి. సి. లకు ఇంజనీరింగు, వైద్యకళాశాలలలో ఇచ్చిన రిజర్వేషన్లు రాజ్యాంగం 15, 16 అధికరణాలలో చెప్పిన అందరికీ సమానావకాశాలను దెబ్బతీసేవిగా వున్నవి గనుక అవిచెల్లవని అగ్రవర్ణ విద్యార్థులచేత రిట్‌పిటిషన్‌లు దాఖలు చేయించారు. 1951లో రాజ్యాంగంలో 15(4), 16(4) క్లాజులను పొందుపరచి రాజ్యాంగ పరంగా బి. సి. రిజర్వేషన్లకు వున్న అడ్డంకి తొలగించబడింది.

## మండల్ కమీషన్ నివేదిక

అక్కడి నుండి 1978 వరకు పరిపాలనలోవున్న కాంగ్రెసు ప్రభుత్వం బి. సి.లను తమ రాజకీయ చందరంగంలో పావులుగా వాడుకున్నదే తప్పవారి సంక్షేమానికి ఇసుమంత సౌలభ్యాన్ని కూడా కలిగించలేదు.

20-12-1978న అప్పటి జనతాపార్టీ ప్రధానమంత్రి. శ్రీ మురార్జీదేశాయ్ పార్లమెంటులో చేసిన ప్రకటన మేరకు మాజీ పార్లమెంటు సభ్యులు శ్రీ బి. పి. మండల్ అధ్యక్షతన వెనుకబడిన తరగతుల కమీషన్ నియమింప బడింది. ఆ కమీషన్‌లో 1) శ్రీ ఆర్. ఆర్. బోలె (యం. పి) 2) శ్రీ దివాన్ మోహన్ లాల్ 3) శ్రీదీనబంధు సాహు 4) శ్రీ కె, సుబ్రహ్మణ్యం 5) శ్రీ యస్. యస్. గిల్ సభ్యులుగా వున్నారు. ఈ కమీషన్ మొత్తం 40 సిఫార్సులను చేసింది. అందులో ప్రధానమైనవి—

1) సాంఘికంగా విద్యావిషయుకంగా వెనుకబాటుతనం మరియు ఆర్థిక సేదరికం అనేవి అంగవైకల్యం పొందిన కులవ్యవస్థ యొక్క రెండు ప్రత్యక్ష ఫలితాలు. వీటిని తొలగించటానికి తీవ్రమైన పరిపాలనా మార్పులు అవసరం.

2) రిజర్వేషన్లు వుండటం వలన అర్హత, యోగ్యత ఏమీ దెబ్బతినవు. జనాభాలో 52 శాతం ఉన్న వీరికి ఆజనాభాకు తగిన రిజర్వేన్లు విద్యా, ప్రభుత్వోద్యోగాల్లోను వుండాలి.

3) ఉద్యోగ నియామ కాలలో ప్రత్యక్షంగా భర్తీ చేసుకొనేటప్పుడు అభ్యర్థుల వయస్సు యస్. టి; యస్. సి. ల అభ్యర్థులవలె పొడిగించాలి.

4) ఆయా కులాల్లోని అభ్యర్థులు దొరకనపుడు ఖాళీలను మూడు సంవత్సరాల వరకు అలాగే అట్టి పెట్టాలి.

5) మిగులు భూములు పంపిణీ బి. సి. లకు కూడా జరపాలి.

6) బి. సి. కులాలు 3743గా తేల్చబడినవి.

మండల్ కమీషన్ నివేదికలోని అంశాలు కులతత్వాన్ని రెచ్చగొట్టేవిగా వున్నట్టు అగ్రకుల పెత్తందార్లు, మేధావివర్గం వక్రీకరిస్తున్నారు. సంక్షేమ రాజ్యంలో అమాత్రం రాయితీలు అయినా ఇవ్వకుండా పీడితవర్గం జీవించటమే కష్టం అవుతుందికదా! మండల్‌కమీషన్ నివేదిక

ననుసరించి బి. సి. లకు రిజర్వేషన్ల సౌకర్యం కల్పించటం విషయంలో పాలక వర్గాలకు చిత్తశుద్ధి లేకపోవటం వల్లనే 1978లో సమర్పించిన నివేదిక ఈనాటికీ ప్రకటనల రూపంలోనే సంక్షోభానికి గురియవుతున్నది.

## ఆంధ్రదేశంలో రిజర్వేషన్ల వ్యతిరేకులు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యేర్పడిన తర్వాత అగ్రవర్ణాలు ఒకరి తర్వాత ఒకరు రాజ్యాన్ని పరిపాలిస్తూ ఆర్థిక ఉద్యోగ విద్యావ్యవస్థల పైన ఆధిపత్యాన్ని కలిగియున్నారు. బి. సి. లకు రిజర్వేషన్లు కల్పించటం కోసం రాష్ట్ర పరిధిలో అనంతరామన్ కమీషన్, మురళీధరరావు కమీషన్ వేయటం జరిగింది. అనంతరామన్ బి. సి. లకు 30 శాతం రిజర్వేషన్లు సూచించగా మురళీధరరావు కమిషన్ 44శాతం రిజర్వేన్లకు సూచించింది. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. రామారావు బి. సి. లకు 44 శాతం రిజర్వేషన్లను ప్రకటించటం, అదేవర్గనికి చెందిన పాలకవర్గ భూస్వామ్య శక్తులు ఆ రిజర్వేషన్లను వ్యతిరేకించటం, ఆకథ నాటకీయంగా ముగియుటం అందరికీ తెలిసిందే. ఇప్పుడు మండల్ కమీషన్ నివేదికానుసారం ప్రకటించబడిన బి. సి. రిజర్వేషన్లుకు వ్యతిరేకంగా ఆంధ్రదేశంలోని అన్ని బూర్జువా పార్టీలలోని అగ్రకుల శక్తులు ఉవ్వెత్తున ఉద్యమాలు నడుపుతున్నాయ్. ఆంధ్రదేశంలోని బి. సి; యస్. సి; యస్. టి; మైనారిటీలు అగ్రకుల స్వభావాన్ని అర్థం చేసుకొని తమహక్కుల కోసం పోరాటాన్ని ముందుకు తీసుకొని వెళ్ళవలసిన చారిత్రక అవసరం ముందుకు వచ్చింది. ఇదే సందర్భంలో ఆంధ్రదేశంలోని మెజారిటీ క్రైస్తవులు యస్. సి.లు. వారి ఆర్థిక సాంఘిక పరిస్థితులు ఇప్పుడున్న యస్. సి. ల పరిస్థితులకు భిన్నమైనవి కావు. అందువలన దళిత క్రైస్తవులను కూడా యస్. సి. లుగా పరిగణించాలనే డిమాండ్ న్యాయమైనది.

సాగు భూమిలో 60 శాతానికి పైగా స్వంతం చేసుకొని 294 అసెంబ్లీ స్థానలలో 210కి పైగా కైవశం చేసుకొని మొత్తం ఆర్థిక, సాంఘిక, రాజకీయ పెత్తనాన్ని అనుభవిస్తున్న అగ్రవర్ణాలు సమసంఘర్షణ సమితి పేరుతో చేస్తున్న అరాచకాన్ని గుర్తించి మన హక్కుల కోసం మనం ఉజ్జ్వలమైన పోరాటాన్ని నడపవలసిన చారిత్రక అవసరం ఉంది.

## సామాజిక వ్యవస్థా నిర్మాణంలో ప్రతిభ ఎవరిది?

రిజర్వేషన్ల సమస్య భారత మేధావుల రెండు దృక్పథాలను స్పష్టం చేయగలిగింది. అంతేకాదు రాజకీయ పార్టీలను కూడామీరు అగ్ర కులాలవైపు వుంటారా?. దళిత వెనుకబడిన తరగతుల వేపు ఉంటారా ? అని నిలవేసింది.

సమాజంలోని రెండు సామాజిక వర్గాలను, ఆ వర్గదృక్పథాలను మరింత స్పష్టం చేయగలిగింది సమస్య.

ఆరెండు వర్గాల్లోని ఆర్థిక అంశాలేకాక వాటి సాంఘిక అంశాలు కూడా చరిత్రలో అనేక సందర్భాలలో నిర్ణాయక శక్తిగా వుంటాయని ఈ సమస్య తేల్చగలిగింది.

వెనుకబడిన వర్గాలు ఎవరు? అని తేల్చడానికి రాజ్యాంగంలో స్పష్టంగా సాంఘికంగా, విద్యావిషయంగా వెనుకబడినవారు అని పేర్కొనడం జరిగింది. వారిలో పెక్కుశాతం ఆర్థికంగాకూడా వెనుకబడిన వారే అనేది చారిత్రక సత్యం.

భారత దేశంలో తరతరాలుగా వెనుకబడిన వర్గాల సాంఘిక విద్యలు, అక్షరవిద్య వచ్చిన తరువాత విద్యాగౌరవంనుండి ప్రక్కకు నెట్టబడ్డాయి.

గిరిజనులు విలువిద్యలో ఉద్దండులు. వారుతమ విలువిద్యద్వారా మొత్తం అడవి భూమి మీద ఆధిపత్యం సాధించగలిగారు. క్రూరమృగాలతో కూడిన అరణ్య భూముల్లో మానవసమాజ నిర్మాణం చేయగలిగారు. అటువంటి విలువిద్యను అగ్రవర్ణాలు సొంతంచేసుకొని 'ధనుర్విద్య' గా నామకరణం చేసి విలువిద్యలో ప్రతిభావంతుడైన ఏకలవ్యుని బొటనవ్రేలునరికి విలువిద్యకు గిరిజనులు అనర్హులని తేల్చివేశారు. గిరిజనులు సహజసిద్ధంగా నేర్చుకొన్న విలువిద్యకు విద్యాగౌరవం లేదన్నారు. నాలుగు మంత్రాలు జోడించి బాణాలకు నాగాస్త్రాలని, బ్రహ్మాస్త్రాలని పేరుపెట్టి మాయలు చేశారు.

సామాజిక వ్యవస్థల పరిణామంలో సమాజానికి ప్రకృతికి జరిగిన సంఘర్షణలనుండి పుట్టిన విద్యలన్నింటి మీద వారు దాడిచేశారు.

ఒక సామాజిక వ్యవస్థమీద మరొకజాతి ఆధిపత్యం సాధించినపుడు, పాలిత జాతుల విద్యావ్యవస్థలను కూడా పాలకులు నాశనం చేయడం జరుగుతుంది. ఆ క్రమంలోనే ఆది భారతీయుల విద్యలమీద దాడిజరిగింది

భారత సమాజ పరిణామంలో వ్యవసాయం అత్యంత కీలకమైన సంస్కృతి వ్యవసాయ సంస్కృతిని రూపొందించడంలో ఎంతో ప్రతిభ వుంది.

వ్యవసాయ సంస్కృతి మీదకూడా 'ఆర్యులు' దాడులుచేశారు.

నిప్పును కనుగొనడం దగ్గర నుండి ఇనుమును కనుగొన్న వరకు పరిణామం చెందిన మానవసమాజ పరిణామాలలో కీలక పాత్ర వహించిన ఆదిభారతీయులైన ఈనాటి బి. సి. యస్. సి. యస్. టి. లు తమ ప్రతిభతో సమాజానికి మూలమైన ఉత్పత్తి పరికరాలన్నింటిని రూపొందించారు. ఇప్పటికి వ్యవసాయ సంస్కృతికి మూలమైన నాగలి, పలుగు పార, గొడ్డలి అన్నిటికీ దళిత బలహీనవర్గాల ఇండ్లే నిలయాలు. వాటిని

ఉపయోగించే విద్యలో వారికే ప్రతిభ వుంది. అగ్రకులవారికి వ్యవసాయ సంస్కృతి మీద పెత్తనం చేయటంలో ప్రతిభవుంది. కాని దాన్ని రూపొందించడంలో ప్రతిభ లేదు. వారు అనేక సంధర్భాల్లో ఆ వ్యవస్థను శిథిలం చేయడానికి అగ్రభాగాన వుంటారు.

ఒకనాడు పశుపాలకులైన అగ్రవర్ణాలవారు, ఈనాడు పశువులను ప్రధానంగా పోషించే బడుగు వర్గాల వారిని 'గొడ్లుకాపే వారు' అనిహీనముగా మాట్లాడటంకూడా చూస్తున్నాం. అనాడువారిని వారు 'గోపాలుర' ని పిలుచుకొన్నారు. పేద వర్గాల వృత్తులను ప్రతిభను అవమానించి వారి విద్యా గౌరవంపై దాడిచేయడంలో అగ్రవర్ణాలు ముందుంటాయి.

గ్రామ సమాజాలు రూపొందిన తరువాత గ్రామ రాజ్యానికి పునాదైన ఉత్పత్తి పరికరాలను రూపొందించే కృషిలో అద్వితీయ ప్రతిభ చూపిన 'కమ్మరి' నిప్పులో ఇనుమును కాల్చి సమ్మెటతో కొట్టి నాగలి ములికిని, కొడవలిని, గొడ్డలిని తయారు చేశాడు. ఐదు ఆరు కమ్మరి కుటుంబాలు మొత్తం గ్రామానికి సంబందించి వ్యవసాయ పరికరాలను అత్యంత నైపుణ్యంగా రూపొందించ గలిగారు. వీరు వ్యవసాయ సంస్కృతిని, సంపదను ముందుకు తీసుకు పోవడంలో కీలక పాత్రవహించారు. ఇనుప యుగవారసులైనవీరు ఆది భారతీయుల్లోని వారే.

గ్రామానికి మొత్తానికి బట్టలు అందించిన నేతపనివారు పద్మసాలీలు కావచ్చు, దేవాంగులు కావచ్చు, కొన్ని చోట్ల దళితులు కావచ్చు, వారు చిలపలు పెలని పొడుగు జేసి అచ్చు అతికి మొలగట్టి మగ్గం మీదకు ఎక్కించి బట్టలునేసి మానవజాతికి వస్త్రె తెచ్చినవారు భారత దేశానికి ప్రపంచంలో పేరు ప్రతిష్టలు తెచ్చి భారత దేశం గురించి ఇతర దేశస్థులు కథలు కథలుగా చెప్పుకొనే ఖ్యాతిని వీరిప్రతిభా నైపుణ్యాలే తెచ్చి పెట్టాయి

భారత దేశానికి యాత్రికులుగా వచ్చిన యితర దేశస్థులందరూ ఈ విషయాన్ని నొక్కి చెప్పారు. వీరికంటే ప్రతిభావంతులెవరు?.

నదీ నాగరికతనుండి వ్యవసాయ సంస్కృతిని రూపొందించే క్రమంలో నదుల నుండి పంటకాల్వలు నిర్మించడం, ప్రాజెక్టులు నిర్మించి వ్యవసాయ భూములను రూపొందించటం వంటి కీలక పరిణామాలకు మూలభూతులైన వడ్డెర, ఉప్పరల కంటే పిండ జీవనులు ప్రతిభావంతులా?.

పలుగు, పార, తట్ట, సుత్తి, మలాటాలవంటి ఉత్పత్తి పరికరాలతో మొత్తం వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు మూలశక్తులైన వీరిని, వీరి ప్రతిభను వీరి సామర్థ్యాన్ని. వీరి ఉత్పత్తి పరికరాలనుండి ఉత్పన్నమైన ఆర్థిక సంపదను ఆహరిస్తున్న పరాన్న భుక్కులు వీరి ప్రతిభను గణనంలోకి తీసుకున్నారా?.

పెను చలికి మానవులు వణికి వణికి చనిపోతున్ననాడు, గొర్రె ఉన్ని నుండి గొంగళి నేసి మానవుని రక్షించిన గొల్లవానికంటే ప్రకృతి శాస్త్ర ప్రతిభ ఎవరిలో వుంది? గొర్రెల మందలతో అడవులలో, కొండలలో తిరుగుతూ ఒక్కగొంగళితో తనను రక్షించుకొంటూ చేతి కర్రతో వేల కొలది గొర్రెలను రక్షిస్తూ, గొర్రెను వడిలో పండ బెట్టుకొని దాని సున్నితమైన శరీరానికి యిసుమంత నొప్పి తగలకుండా ఆ ఉన్నిని తరిగి ఆ ఉన్నినితొడ మీద అత్యంత నైపుణ్యంగా పేని గొంగళి నేసే ఆ ప్రతిభ నెయ్యిని,నవధాన్యాలను నిప్పులో పోసి యాగం అని పేరు పెట్టి భోగం అనుభవించే అగ్రవర్ణులకు ఉందా?

గణ వ్యవస్థకు యాదవులు సంకేతం. గణ వ్యవస్థలో వున్న సంస్కృతి వారిలో మనకు కనిపిస్తుంది. మాతృస్వామ్య వ్యవస్థ వీరికి ప్రధానంగా వుండేది. అనార్యాగణాల్లో ఒకరైన వీరిని తమలో కలుపు



రిజర్వేషన్లు—

కోవడానికి ఆర్యజాతులు 'కృష్ణ' పాత్రను సృష్టించి, హిందూ సంస్కృతి లోకి తరువాత కాలంలో కలుపుకున్నారు.

మాతృస్వామ్య వ్యవస్థలో వీరు మొదటిగా—చెంచేరి,కావేరి, పైడితల్లి మొదలగు వారిని పూజించేవారు. అపైదికుల తరపున వైదికులతో యుద్ధంచేసిన గణాల్లో యాదవులు ముఖ్యులు. క్షత్రియ రాజైన మను మసిద్ధినిఎదిరించి బ్రాహ్మణ సేనాధిపతైన ఖడ్గతిక్కన్నను వధించిన కాట మరాజు 'గొల్ల రాజు' ప్రతిభావంతుడు కాదా? యదుగణం అనార్య గణా ల్లో ప్రసిద్ధమైంది. వీరందరిని గలిపి యాదవులంటున్నారు.

పూనిగొల్ల, పూజగొల్ల, ఎర్రగొల్ల, పెద్దటిగొల్ల అనే పేరులలో ఆంధ్రలో వున్నవారు వ్యవసాయము, పశుసంపదను కలిగి వున్నారు. వాటి అభివృద్ధికి కృషిచేస్తున్నారు.

అయితే బ్రాహ్మణులు గొల్లల సంఘకర్మకాండలో గొల్ల పెద్ద స్థానంలోకి చొరబడడానికి ప్రయత్నించడంలో ప్రతిభ చూపిస్తున్నారు.

గౌడ శెట్టిబలిజలు తాడికల్లు గీయడంలో ఎంతోచాకచక్యంచూపి స్తున్నారు. ఆంధ్ర దేశవ్యాప్తంగా ఎన్నో లక్షల పూరిళ్ళకు తాటాకు కొట్ట డంగాని, కల్లుగీయడం గాని ఎంతో నైపుణ్యంతో కూడిన పని. పదునుగల కత్తులను బొడ్డుచుట్టూగుచ్చుకొని మోకుతో పైకిపాకుతూ మోకుఆధారంగా కాళ్ళ మీద నిలబడి తాటాకు కొట్టడంకాని కల్లుగీయడంకాని ఎంతోప్రతిభా వంతమైన పని, అక్కడ నుండి జారి పడి, ఆపదునైనకత్తులు గుచ్చుకొని మరణించిన వారెందరో! చారిత్రకంగా వీరికి ప్రసిద్ధివుంది. నైజామును ఓడించి హైద్రాబాదును పట్టుకొన్న సర్దారు పాపడు గౌడజాతీయుడే.

అనార్య తెగలకు సంబంధించిన వీరి మీద కూడా హిందూ సంస్కృతి పట్టును బలంగా వేయడానికి బ్రాహ్మణులు ప్రయత్నించారు.

ఆర్థిక వనరులు వున్న వెనుకబడినకులాలకు బ్రాహ్మణ పూజారులు కర్మ కాండలు నిర్వహించి వారిని శూద్రులుగా స్థిరీకృతం చేయడానికి ప్రయత్నిస్తుంటారు. అయితే వారికి ఆర్థిక రాజకీయ అధికారాలలో వారు కీలక పాత్రను కోరినపుడు వారిని అణచివేయడానికి వేయి కరాలతో యుద్ధం చేస్తుంటారు. కృష్ణుడు గొల్లవాడంటారు. కృష్ణుణ్ణి పూజిస్తుంటారు. గొల్లవార్ని హీనంగా చూస్తారు. అరుంధతి మా యింటి ఆడపడుచు అని అంటారు. దళిత స్త్రీ కనబడితే 'ఒసే' 'ఓయే' అని పిలుస్తారు. ద్వంద్వ నీతిని ప్రవచించడంలో ఆచరించడంలో అద్వితీయ ప్రతిభ వుండిఅగ్ర వర్ణాల వారికే.

నదీ నాగరికత వెల్లివిరిసిన కాలంనుండి ఈ నాటివరకు సము ద్రంమీద, నదీ నదాలమీద ఆధిపత్యం సంపాదించి మానవ సమాజాన్ని ప్రభావితం చేసిన వారు 'బెస్తలు'. భయంకరమైన తిమింగలాల తోనూ బడబానలంతోనూ కూడినసముద్రాన్ని జీవనవ్యవస్థకు అనుకూలంగా మల్చిన మహోన్నతుడు మత్స్యకారుడు మొత్తం వాణిజ్యరంగానికి మూలమైన పడవని, బోటుని నడపడమేగాక మత్స్యకారుడు ప్రకృతికి లయను మేళవించ దగిన గానాన్ని ఆలపించిన కళాకారుడు. ఈ బెస్తలు అనేక సందర్భాల్లో ప్రకృతి బీభత్సాల్లో హతులవుతున్నారు. నిరాశ్ర యమైన వీరికుటుంబాలు ఎన్నో బాధలలో లయల్లో సుడులు తిరుగు తున్నాయి.

ఇక బడుగువర్గాల్లో సేవక వృత్తిలో మగ్గుతున్న రజకులు గ్రామీణ భారతంలో దగాపడ్డ చాకిరీ వీరులు, మైలు బట్టలువుతికి అమ్మని మరిపిస్తున్నవారు చౌడుమట్టిని సున్నపు గడ్డని కలిపిన కమ్ములో గుడ్డలు ఉడకేసి మురికిని పిండిన రసాయనశాస్త్రజ్ఞలు

ఇప్పటికీగ్రామాలలో ఈ రజకులు
పెండ్లికి కబురు చెప్పేటోళ్ళు
ఇంటికి వెల్ల వేసేటోళ్ళు

ఉవిటి పట్టె టోళ్ళు
పల్లకి మోసెటోళ్ళు

తూమెడు గింజలుకోసం నిరంతరం శ్రమిస్తున్న ఈ బడుగు జీవులు చిన్న చిన్న వాగుల్లో మురికినీళ్ళల్లో గుడ్డలుతికి తెల్లగా తెచ్చి జాతికి గౌరవం చేకూర్చుతున్నారు. వీరిని ఈ నాటికీ చాకలోళ్ళని నీచంగా పిలుస్తూ అవమానిస్తున్నారు. వీరి శ్రమశక్తిని దోచుకొంటున్నారు.

ఇక అగ్రవర్ణాలచే "మంగలోళ్ళుగా" పిలువబడుతున్న కళాజీవులు, మహాశిల్పులు నాయీబ్రాహ్మణులు. వీరుశరీరంపై మెత్తనికత్తితో క్షౌరంచేసి ముఖానికి ఒకరూపం, ఆకారం తెచ్చిన వారు. పెండ్లైనా, చావైన మేళాంవాయించేది వీరే, మానవుని మానవునిగా మల్చడంలో వీరి ప్రతిభ ఎవరికుంది? అలాగే విశ్వబ్రాహ్మణుల కళానైపుణ్యంతో ఎవరు సాటిరాగలరు?

సాంఘికవ్యవస్థా నిర్మాణంలో ప్రతిభావంతులైన వీరికి ఆయా రంగాలను అప్పజెప్పి అక్షర ప్రతిభావంతులు అక్షరరాజ్యాలు ఏలుకోగలరా?

వ్యవసాయదారుడికి భూమి, నేతపని వారికి జౌళివ్యవస్థ అప్పజెప్పగలరా?

దూది ఏకి గింజలు తీసి దిండ్లు, పరుపులు తయారుచేసి, దూది వడికి చరకాలో దారం తీసి ఖాదీవస్త్ర పరిశ్రమకు శ్రమ ధారబోస్తున్న 'దూదేకులు' భారత దేశానికి ఎంతో సేవచేశారు. "నూరుభాషా"లుగా పిలవబడుతున్న వీరు దుర్భరమైన పేదరికంలో జీవిస్తున్నారు. వారి త్రిక ప్రాధాన్యతకలిగి స్త్రీల అలంకరణ వస్తువులైన కుంకుమ, సూదులు పిన్నులు మొదలైన వాటిని సమకూర్చుతూ జీవిస్తున్న కుంకుమ దాసరులు కృష్ణబలిజలుగా పిలవబడుతున్నారు. వీరు కూడా రాష్ట్రంలో గణనీ

యంగానే వున్నారు, వీరి కళను వాడుకున్నారేగాని వీరినిపట్టించుకున్న వారులేరు.

రజకులు, నాయీబ్రాహ్మణులు, కృష్ణబలిజలు, నూరుబాషాలు వంటి వారి కులాలనుండి రాష్ట్ర అసెంబ్లీలో ఒక్క ప్రజాప్రతినిధి కూడా ఇంతవరకు ఎన్నికే కాలేదు.

మూడునాలుగు కులాలే మొత్తం అసెంబ్లీలో 60% పైగా పెత్తనం చేస్తున్నాయి. రాజకీయ అధికారాన్ని పెనవేసుకుని అన్ని ప్రయోజనాలు వాళ్ళే అనుభవిస్తున్నారు.

శూద్రుడు బ్రాహ్మణుణ్ణి నిందించితే, అతని నాలుక కోయమన్నారు. జన్మను బట్టే భారతదేశంలో మనిషిస్థాయిని నిరూపిస్తూ వచ్చారు. అందుకే శూద్రకులాలలోని బడుగువర్గాలు సామాజిక నిర్మాణంలోను ఉత్పత్తి రంగంలోను ప్రతిభావంతులే అయినా వారిని జన్మను బట్టి హీనమైన వారిగా పరిగణిస్తూ వచ్చారు.

శూద్రకులాల్లోని కొంచెం ముందుపడ్డ రెడ్డి, కమ్మ, వెలమ, మొదలగు వారు తరతరాల రాచరికవ్యవస్థల్లో ముఖ్యంగా హిందూరాజ్యాలకు తురుష్కరాజ్యాలకు ఘర్షణలు జరిగేటపుడు తురుష్క రాజులకు కొమ్ముకాసి భూములు, బుద్రలు సంపాదించుకోగలిగారు. బ్రాహ్మణులు ఆ తరువాత వారికి పౌరోహిత్యం చేయడం ప్రారంభించి కులధర్మాన్ని, ఆధిపత్యాన్ని వారికి బాగా బోధించారు. ఇప్పుడు ఈ భూస్వామ్యకులాలు కులాధిపత్యలక్షణాలను బాగా వంటపట్టించుకున్నాయి.

కులవృత్తుల ఉత్పత్తి పరికరాలు మొత్తం గ్రామవ్యవస్థ యొక్క ఆర్థిక వ్యవస్థను నడుపుతున్నాయి. పేదకులాల ఉత్పత్తి సాధనాలకు వారికులాన్ని బట్టి గౌరవం తక్కువగావుంది. కులవ్యవస్థ కేవలం ఒక సాంఘికవ్యవస్థేకాదు. అది ఆర్థిక సాంఘిక వ్యవస్థల నిర్ణాయక శక్తిగా కూడా ముందుకు వస్తుంది.

భారతదేశంలో ఏవ్యక్తికైనా అతని పనికి మాటకు అతని కులాన్ని బట్టే గౌరవం లభిస్తుంది. కానిపై పుణ్యాన్ని బట్టికాదు.

ఈ మనిషి ఏకులంలో పుట్టాడు అన్న దానిని బట్టే సంఘంలో అతని ప్రతిభను నిర్ణయిస్తున్నారు.

హిందూ రాజ్యాల్లోనైతే మనుస్మృతి ఆధారంగా జన్మను బట్టి శిక్షలు విధించారు. బ్రాహ్మణుడు ఎవరినైనా చంపితే రెండురోజులు ఉపవాసం మాత్రమే శిక్ష. అదే శూద్రకులం వాడు బ్రాహ్మణుణ్ని దూషించితే నాలుక కోయమన్నారు. అగ్రవర్ణాలుగా చెప్పబడుతున్న వారిలో ఉన్న ద్వేషం, అణచివేత లక్షణాలు బడుగువర్గాలలో ఉండవు. అయితే బడుగువర్గాల ప్రజల మానవ విలువలను తూచి వారిని గౌరవించే మానవసమాజంఏది ?

సామాజికంగా సాంస్కృతికంగా ఈ జాతుల్లో నిక్షిప్తమైన ఇన్ని ప్రతిభలను ప్రక్కకుపెట్టి ఇంగ్లీషు చదువుల్లో నాలుగు మార్కులు ఎక్కువ సంపాదించి ఆ అక్షరాల మీద తప్ప ఇంక ఏ విధంగా జీవించే సత్తువలేక దారిని పోయే వారిమీద కిరసనాయిలు పోసి అంటించి ప్రతిభ కాలిపోతుందని గోలపెడుతున్నారు ఈ కుహనామేధోవారసులు. భారత దేశములో జానపద కళాసాహిత్య స్రష్టలైనవారు బడుగు జాతులే కాని బ్రాహ్మణులు కాదు. యక్షగాన వాఙ్మయాన్ని రూపొందించినది దళితులే. తోలు బొమ్మలఆటల దగ్గర నుండి పగటి వేషాల దాక ఎన్నో కళా రూపాలను ఈ దళిత జాతులే సృష్టించి పోషించాయి. చెంచు, బుడబుక్కల, కోయ, లంబాడీ, సవర వంటి ఆదిమ తెగల జీవనమే కళామయం. వారి జీవితా లలో శ్రమ, కళ మేళవింపబడి ఉంటాయి. 'పని, పాట,' 'ఆట, పాట,' అనే నానుడులు వారి జీవనగతుల నుండే జనించాయి.

విల్లు మొదలుకొని ఎన్నో రకాల ఆయుధాలు ధరించి గిరిజనులు ప్రకృతిలో నిక్షిప్తమైన కళాసంపదకు వారసులుగా ఉన్నారు. కపటం, ద్వేషం ఎరుగని వారిలో మానవతా విలువలు నిక్షిప్తమైఉన్నాయి.

బడుగువర్గాల్లో దొమ్మరి, భోగం, కళావంతులుగా పిలవబడుతున్న కులాల వారు అద్భుత కళాజీవులు. నాట్యం, సంగీతం, నాటకం, చిత్రలేఖనం, కవిత్వంతో పాటు ఎన్నో కళల్లో ఆరితేరినవారు వీరే! ఆంధ్రసాహిత్యంలో అత్యంత ప్రతిభావంతుడైన చేమకూర వెంకటకవి, రంగాజమ్మ, ముద్దు పళనివంటివారందరూ ఈ కులాలలో పుట్టినవారే. విజయ విలాసం వంటి అత్యద్భుతకావ్యాన్ని రచించిన 'చేమకూర' 'ఏగతి రచియించిరేని సమ కాలము వారలు మెచ్చరేకదా' అని బ్రాహ్మణులద్వేషానికి భాష్యంచె ప్పాడు. ఆధునిక యుగంలో కవిచక్రవర్తిగా నిలిచి 'కుగ్రామీణభాషా బ్దిలో జగా పల్కుల సారస్యాన్ని ప్రజా కవిత్వంలోకి ప్రవహింప చేసి, దీనుల గుండె గాథలను కర్కశ హృదయాలకు గబ్బిలాలతో వినిపించిన మహాకవి జాషువా దళితులలో పుట్టినవారే. ఆధునిక సాంస్కృతిక విప్ల వాన్ని గుండె డప్పులతో ప్రజ్వలింప జేస్తు జనం పాటని తూటాగా పేల్చు తున్న గద్దరు ప్రభవించింది ఎక్కడ? విప్లవయుగంలో జ్వలిస్తున్న అజ్ఞాత సూర్యుళ్ళు రాజన్నలు ఏ అమ్మలు కన్న బిడ్డలు? ప్రతిభలు ప్రజ్ఞలు ప్రజ్వలనాలు దళిత బలహీనవర్గాల గుండె కొలుముల నుంచే ప్రజ్వలిస్తాయి. అని వీరు రుజువుచేయటంలేదా!

ఆత్మబలం లేక నిర్వీర్యుని స్తేజ సిద్ధాంతాలు వల్లిస్తున్న అరుణ్ శౌరి వంటి కుహనా మేధావులు తమ అభ్యుదయ ముసుగులు చీల్చి కులం రంగును బట్ట బయలు చేస్తున్నారు. కాని సామాజిక ప్రతిభలను, కళలను గుర్తించ లేకపోతున్నారు. పత్రికలు ప్రభుత్వాలు ప్రజలు మానవతా విలువలు వైపు మారణహోమం వైపు రెండుగా చీలి నిలబడి వాదించు కుంటున్నారు. ఒక పత్రికా సంపాదకుని కంటే ఒక సామాన్యుడే విజ్ఞతతో వాదిస్తున్నాడని, ప్రజలు ఆ పత్రిక చదవడం మానివేసి సామాన్యుడి వాదననే వింటున్నారు. "ఇంతవరకు బ్రాహ్మణ పత్రికల మోసపూరితమైన రచనలు చదివి మోసపోయామని" తమలో తాము చర్చించు కుంటు న్నారు. ఎప్పుడు పేదవర్గాలకు సంబంధించిన హక్కుల ప్రస్తావన వచ్చిన

అగ్రవర్ణాలు మూకుమ్మడిగా దూకి విధ్వంసానికి పూనుకుంటాయని బడుగు వర్గాలకు అర్ధమవ్వడం ప్రారంభించింది.

ఇంతకుముందు గుజరాత్‌లో, బీహార్‌లో జరిగిన మారణహోమం ఒక్కసారి వారి స్మృతిపథం మెదులుతూవుంది.

అసలు స్వతంత్రం వచ్చింది ఎవరికి? ఎవరు ఈ స్వతంత్రం వలన లబ్ధిని పొందుతున్నారు? మనం స్వతంత్ర భారతంలో భాగం కాదా? అనే ప్రశ్నలు దళిత బడుగు వర్గాల విద్యార్థుల ముందుకువచ్చి నిలబడ్డాయి. వారు నిజమైన చదువు చదవడం ప్రారంభించారు. ఇది అగ్రకులాల పెత్తందారీ సమాజం. ఈ ప్రభుత్వాలు, న్యాయ స్థానాలు, రక్షకభట వర్గాలు అగ్రవర్ణాలకే అని వారు అర్థంచేసుకుంటు న్నారు. అగ్రకులాల విద్యార్థులు బస్సులు తగలబెడితే వారివెంట నిల బడే రక్షక భటులు, తాము నినాదమిస్తేనే ఎందుకు తమ నోటిమీద కొడు తున్నారో? వారికర్ధమౌతూవుంది. ఈ దళితబలహీన వర్గాలవారు న్యాయ స్థానం వైపు చూశారు. అది అగ్రకుల ధర్మాసనం అని తేలిపోయింది. మను స్మృతి పీఠమని అర్థమైంది. ఇంతవరకు పేదకులాల వారికే ఎందుకు శిక్షలు పడుతున్నాయో? పెద్దపెద్ద తప్పులు చేస్తున్న అగ్ర కులాల వాళ్ళెలా పెద్దమనుష్యులుగా చెలామణి అవుతున్నారో? పేద కులాలకు సంబంధించిన వారే ఎందుకు జైళ్ళలో మగ్గుతున్నారో వారికి అర్ధమౌతూవుంది. అంతేకాదు కోర్టును ధిక్కరిస్తు జనం మాట్లాడటం ప్రారంభించారు. ఈసారి కోర్టు మౌనం వహించింది. ఇన్నాళ్ళు ధర్మపీఠం మీదుగా జరిగిన అధర్మం అంతా ఎక్కడ బయటకి వస్తుందో అని ఆందోళనపడింది ధర్మాసనం.

బడుగు వర్గాల ప్రజల్లో చైతన్యం ఆలోచనా ప్రారంభమై నాయి. వారు ఇక అన్ని విషయాలు ఆలోచించటం ప్రారంభించారు. ఎవరు ప్రతిభావంతులు? ఎవరు ఈ దేశాన్ని కుదువ పెట్టినవారో తేల్చా లని చరిత్రను తవ్వితీశారు.

నిప్పును కనుగొంది ఎవ్వరు ?
బాణాన్ని కనుగొంది ఎవరు ?
ఇనుమును కనుగొంది ఎవరు?
ఆది భారతీయులు ఎవరు ?

అని ప్రశ్నించుకున్నారు. అన్ని ప్రశ్నలకు దళితులు, బడుగువర్గాలు అనే సమాధానాలే వచ్చాయి. వారిలో ఆత్మ స్థైర్యం పెరిగింది.

అగ్రకులాల్లో ప్రధానులైన బ్రాహ్మణులు, బ్రాహ్మణ సంస్కృతికి మూలమైన ఆర్యులు భారతదేశానికి వలస వచ్చినవారు అనేది అర్థమైంది. క్రీ.పూ. 2000 - 2800 మధ్యలో భారతదేశానికి వలసవచ్చినవారే ఆర్యులు. ఆర్యా త్రైవర్ణికాః. వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులుగా పిలవబడ్డారు. ఆనాటికి ఆదిభారతీయులుగా ఉన్న ఆదిమ తెగలను ఆర్యులు యుద్ధంలో జయించారు. వారికి లొంగినవారిని శూద్రులుగా పరిగణించారు. వారిని ఎదిరించిన వారిని అస్పృశ్యులుగా బహిష్కరించారు. ఈ శూద్రులు అస్పృశ్యులు ఒక్కరే. హిందూ సమాజం పరిధిలోకి రాకుండా స్వతంత్ర జీవనంలోవున్న గిరిజనులు వారి సోదరులే.

శూద్రుల్లో కొన్ని అగ్రకులాలు మాత్రం బ్రాహ్మణీకరణం చెందాయి. పై మూడు వర్ణాలు, శూద్రుల్లోని మూడు నాలుగు కులాలు కలసి అగ్రకులాలుగా పిలువబడుతున్నారు. వారి సంఖ్య వందకి పదిహేను మాత్రమే. వందకి ఎనభై అయిదు మంది ఆదిమభారతీయ జాతులు.

తరతరాలుగా అణిగిపోయిన ఈ బడుగు జాతులు ఇప్పుడిప్పుడే తమ చరిత్రను తాము తెలుసుకొంటున్నాయి. తమ చరిత్రను తాము నిర్మించుకోవాలనే చైతన్యంలోకి ప్రవహిస్తున్నాయి.

అంతేకాదు ఆర్థిక రాజకీయ అంశాలే పునాదికి సంబంధించినవని కులం ఉపరితల అంశం అని భావించిన కమ్యూనిస్టులు కూడా భారతీయ

సమాజాన్ని గురించి పునరాలోచించటం ప్రారంభించారు. కులాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడటం నుండే కుల నిర్మూలన సాధ్యమని గమనిస్తున్నారు. బడుగు వర్గాల సాంఘిక పోరాటంలో చిత్తశుద్ధితో కొందరు భాగస్వామ్యం కాగలుగుతున్నారు.

కులవ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించవలసింది కుల అణిచివేతకు గురైన దళితులే అనే అంశాన్ని కూడా వారు గుర్తించడానికి ఇంకా కొంత సమయం పట్టవచ్చు. ఎందుకంటే దళిత బలహీన వర్గాల పోరాటాలను కమ్యూనిష్టులు కులపోరాటాలుగా కొట్టి పారవేశారు. అవి కులాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్న సాంఘిక ఉద్యమాలుగా గుర్తించలేకపోయారు. కులాధిపత్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటం కుల నిర్మూలనకు దారితీస్తుందని వారు అవగాహన చేసుకోలేదు. అందుకే చాలాకాలం దళిత ఉద్యమాలను వారు వ్యతిరేకిస్తూ వచ్చారు.

మండల్ కమీషను అమలుకు కమ్యూనిష్టు పార్టీలు అనుకూలంగా ప్రతిస్పందించడం, దళిత ఉద్యమాల సాంఘిక హక్కుల పోరాటాన్ని వారు బలపర్చడం ఆంధ్రలో కమ్యూనిష్టు విప్లవోద్యమాల్లో వస్తున్న శాస్త్రీయమైన పరిణామం. ఇవి దళిత బలహీన కులాలల్లో పీడిత వర్గ రూపాన్ని చూడగలగడమే గొప్ప మార్పు.

కోదండరామిరెడ్డి కులసమస్యపై వ్యాఖ్యానిస్తూ 'విప్లవం వచ్చిన తదుపరి, సంపద పంచబడిన తరువాత, జాతీయంచేయబడిన తరువాత కులసమస్య దానంతటదే పోతుందని కమ్యూనిష్టులన్నారు. ఇట్లాంటి యాంత్రిక పద్ధతిని ప్రవేశపెట్టినవాడు స్టాలిన్. ఉత్పత్తి సంబంధంలో మార్పులు వచ్చిన మరుక్షణం సంపద పంచబడిన మరుక్షణం స్త్రీ పురుష సంబంధాలు ఇతర సంస్థలుకూడా మారిపోతాయి అనేది మార్క్సిజాన్ని యాంత్రిక దృక్పధంతో అర్ధం చేసుకోవడం.' పౌర హక్కుల

కాంగ్రెస్‌లో అగ్రకుల హిందూ మత తత్వం దాగున్నదని ఆర్.యస్.యస్.కి కాంగ్రెస్‌కి అంతర్గత సంబంధాలు వున్నాయని పటేల్ కాంగ్రెస్‌లో ఉన్న ఆర్.యస్.యస్. వాదేనని అంబేద్కర్ ఆనాడే తెలియచేశాడు. ఈ మతోన్మాదుల చరిత్రను కొంత మనం అవగతం చేసుకుంటే గాని వాస్తవాంశాలు మన ముందుకురావు.



# మతోన్మాదుల చరిత్ర

భారతదేశంలో హిందూ మతోన్మాదాన్ని పెంపొందించటంలో ఆర్.యస్.యస్. పాత్ర గణనీయమైంది. దాని కుతంత్ర పూరితమైన వ్యూహమే 'రామజన్మభూమి-బాబ్రీ మసీద్' వివాదం. ఆర్.యస్.యస్. శక్తుల మతోన్మాద చరిత్రను మనం అర్థం చేసుకుంటేగాని ఈ వివాదం విషయం మనకు అవగతం కాదు.

హిందూ మతం ఒక కాలకూట విషనాగు. అది వర్ణ వ్యవస్థను పెంచిపోషించింది. కుల విద్వేషాలు రేపింది, అస్పృశ్యతా మారణ హోమాన్ని ఆచరించింది. ఈ హిందూ మతంయొక్క నియంతృత్వాన్ని అమానుషత్వాన్ని భరించలేక దళితబలహీన వర్గాల ప్రజలు శిక్కు, ఇస్లాం క్రైస్తవ మతాలను స్వీకరించారు.

ఆర్.యస్.యస్; దళిత బలహీన వర్గాలను అణగద్రొక్కడమే గాక వారు స్వీకరించిన మైనారిటీ మతాలను ద్వేషించడం, నిర్జించడం చేస్తూ వచ్చింది. భారతదేశంలో ఇదొక పెద్ద సంఘర్షణగా సాగుతూ వచ్చింది.

మూడు దశాబ్దాలపాటు రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్(R.S.S.) నాయకుడిగాఉన్న యం.యస్. గోల్వాల్కర్ 1939లో వ్రాసిన 'మనం' అనే పుస్తకంలో ముస్లింలను ఉటంకిస్తూ 'ఖూనీకోర్లు', 'దోపిడీ దొంగలు', 'బందిపోటు దొంగలు', 'శత్రువులు', 'నాశనం చేయాల్సిన శక్తులు', 'దండయాత్రలు చేసిన విరోధులు', 'మనఘోరమైన పాత శత్రువులు', వంటి మాటలు వాడటం జరిగింది."* భారతీయులుగావుండి ఇతర మతం తీసుకున్నందులకు వారిని శత్రువులుగా చిత్రించడం జరిగింది. ఇస్లాం భారతీయం కాదు కాబట్టి ఇస్లాం స్వీకరించిన వాళ్ళుకూడా భారతీయులు కాదనే వాదం లేవనెత్తారు.

---

* చరిత్ర చోదకత్వం -బిపిన్ చంద్ర (కదలిక నుండి)

ఈనాడు భారతీయ మతంగా చెలామణి అవుతున్న హిందూ మతంకూడా ఒకనాడు వలసవచ్చిన వైదికమత పరిణామరూపమే. వైదిక మతాన్ని ప్రవచించిన ఆర్యులు భారతీయులు కాదని 'తిలక్' అంగీ కరిస్తున్నాడు. అందువల్ల ఈనాడు హిందువులందరూ భారతీయులు కాదనడం యదార్థ మవుతుందా? భారతీయ సంస్కృతిలో భారతదేశ వాస్తవికతనుండి పుట్టిన బౌద్ధమతం ప్రపంచంలో పెక్కుదేశాలకు వ్యాపిం చింది. వారందరూ భారతదేశంనుండి వలస వెళ్ళినవారా? భారతీయు లను విడదీసి పాలించే వలస వాదుల చరిత్రనే గుండెలకు పట్టించుకొని మత విద్వేషాన్ని ఇరుపక్షాలు పెంచుకుంటూ వచ్చాయి.

భారతదేశ చరిత్రను హిందూ, ముస్లిం, బ్రిటిష్ యుగాలుగా వర్గీకరించిన ఘనత జేమ్స్‌మిల్‌కు దక్కగా, తర్వాత యిది ద్విజాతి (Two - Nation theory) సమర్థించడానికి ప్రధానాంశంగా ఉపయోగ పడింది. ఈ స్ఫూర్తితో బయలుదేరిన జాతీయ ఉద్యమ నాయకులలో 'హిందూ-ముస్లిం' భేదం కొట్టొచ్చినట్లు కనపడేది. జాతీయ ఉద్యమంలో బలంగా చోటుచేసుకున్న ఈ వైషమ్యం దేశవిభజనకు దారితీసింది. భారతదేశంలో జాతీయ రాజకీయాలు ప్రారంభమైన నాటినుండి రాజకీ యాలకు మతానికి అవినాభావ సంబంధం బలంగా పెనవేసుకుంది.

19వ శతాబ్దంలో భారత రాజకీయాలలో మతవాదం చోటుచేసు కొనేసరికి భారతచరిత్ర కూడా మతపరంగా అన్వయించి వ్రాయడం మొదలయింది. మధ్యయుగ భారత చరిత్రను మతవాదులు సుదీర్ఘ మయిన హిందూ ముస్లిం సంఘర్షణగాచూస్తూ అనివార్యంగా అదే దృష్టిని 19, 20 శతాబ్దాలకు అన్వయిస్తూ జాతి వివక్షతా సిద్ధాంతానికి, రాజకీయా లకు ఈ అధునిక యుగంలో "న్యాయం" చేయగలిగా మనుకొంటున్నారు. మతవివక్షతా చరిత్రకారులు మధ్యయుగాలలోని ముస్లిం పాలకుల పాల నను విదేశీయుల పాలనగా చిత్రీకరిస్తూ, భారతసమాజానికి ముస్లిములు



రిజర్వేషన్లు —

శాశ్వతంగా విదేశీయులని చెప్పగలుగుతున్నారు.* ఈ ధారుణమైన భావము హిందూ, ముస్లిముల వైషమ్యాలను పెంచడానికి మరింతగా తోడ్పడింది. మతాన్ని రాజకీయాలకు ఉపయోగించుకోవడమనే ప్రక్రియే భారతదేశం చీలికకు దారితీసింది. ఈనాటి అంతస్సంఘర్షణలకుకూడా బలంగా మూలమవుతుంది. ఈ విషయాన్నే బలపరుస్తూ "భారతదేశంలో కాంగ్రెస్ పుట్టుపూర్వోత్తరాలు" అనే గ్రంథంలో సి.యఫ్. ఆండ్రూస్ గిరిజా ముఖర్జీ ఏమంటున్నారో చూడండి—

"ప్రపంచంలో ఎక్కడాలేనంతగా భారతదేశంలో మతం, రాజకీయాలు మిశ్రితమై వున్నాయి. వాటిని విడదీయడానికి మనం ఎంత ప్రయత్నించినప్పటికీ అది సాధ్యపడదు. ఇది ఒక హిందూ మతానికే వర్తిస్తుందని చెప్పడానికి వీలులేదు. ఇతర మతాల సంగతికూడ అలాగే వుంది. ఇస్లాం మతమే రాజ్యాన్ని పాలిస్తుందని మహమ్మద్ ప్రవక్త చెప్పారు. ఇటీవల కాలంలోకూడా ఇదే దోరణి సాగడం మనకు కనపడుతుంది. ఇక ఉత్తర భారతంలో సిక్కుల 'ఖల్సా ఉద్యమం' తీసుకొంటే రాజకీయ, సాంఘిక స్వేచ్ఛపట్ల భారతీయుల ఆలోచనాసరళి ఏ విధంగా వుండేదీ అర్థమవుతుంది. మతపరమైన చైతన్యం ద్వారా దానిని సాధించాలనుకుంటారు." •

ఆనాటి నుండి ఈనాటి వరకు పెక్కురు గుండెల్లో నాటుకుపోయిన ఈ భావాలు ఏ విధమైన దుష్పరిణామాలకు దారితీస్తూవున్నాయో మన కండ్లకు కట్టినట్లు కనిపిస్తూవుంది. భారతీయులను రెండు ముఠాలుగా చీల్చి అంతర్విభేదాలకు గురిచేసే సామ్రాజ్యవాద కుతంత్రం ఆనాటినుండి ఈనాటి వరకు సాగుతూనేవుంది. ఈ విషయాన్ని ప్రసిద్ధ చరిత్రకారులు డా॥ రొమిల్లాథాపర్ మాటల్లో చూడండి—

---

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తీరుతెన్నులు

— మాకినేని బసవపున్నయ్య వ్యాసం నుండి

• * చరిత్ర చోదకత్వం — బిపిన్ చంద్ర. (14, 15 పేజీలు)

"వలస ప్రజలలో విభేదాలను రెచ్చగొట్టడం, సామ్రాజ్యవాద లక్షణాలలో ప్రధానమైనది. దీనివల్లవలస ప్రజలలో రెండుమతాలు ఏర్పడి ఉభయులూతాము సాంస్కృతికంగా భిన్నులమనేవిశ్వాసంతో అధికారం కొరకై పోటీపడతారు. ప్రతిమతా తన సంస్కృతికి ప్రత్యేకపునాదులను పరిశోధించడానికి ప్రయత్నించడంతో 'పునరుద్ధరణవాదం' బయలుదేరి విభేదాలను మరింతరెచ్చగొడుతుంది. భారతదేశంలో భిన్నములైన హిందూ, ముస్లిం సంస్కృతులువుండనే వున్నాయి. ద హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియాలో హిందూ, ముస్లిం, బ్రిటిష్‌యుగాలుగా విభజించడం ద్వారా జేమ్స్‌మిల్ హిందూ,ముస్లిం విభేదాలకు దోహదంచేశాడు. అందుకుతగి నట్లు దేశరాజకీయాలలో మతవైషమ్యాలు రెచ్చిపోయాయి. హిందువులు వైదిక సంస్కృతిని, ముస్లిములు ఇస్లాం స్వచ్ఛతను ఆశ్రయించారు. ముస్లిములకు సలహాయిస్తూ, మొహమ్మద్ ఇక్బాల్ విచ్ఛిన్నమైనశక్తు లను సంఘటితపరచి, ఐక్యాన్ని చేకూర్చి క్లిష్టపరిస్థితులలో ముస్లిములను రక్షించగలది ఇస్లామేనని, నిత్య చైతన్యవంతములైన ఇస్లాం సిద్ధాంతాల మీదనే తమ దృష్టిని కేంద్రీకరించవలెనని హెచ్చరిస్తున్నాడు." •

ఈ విధంగా సాగిన హిందూ ముస్లిం వైషమ్యం భారతీయుల సమైక్యతను వ్రియ్యలుచేసి జాతీయదృక్పధాన్ని దగ్ధంచేస్తూ వచ్చింది. జాతీయోద్యమ కాలంలోకూడా లౌకిక జాతీయవాదులు హిందూ ముస్లిముల ఐక్యతకు కృషిచేశారు. అయితే వారి ప్రయత్నం ఫలించలేదు. చరిత్రను మతపరంగా విశ్లేషించుకొని, ఈర్ష్యను, స్పర్ధను ఏ విధంగా పెంచు కున్నారో రొమిల్లా థాపర్ వాస్తవదృష్టినుండి ఈ విధంగా విశ్లేషిస్తు న్నారు.

"గతాన్ని ఆదర్శంగా చిత్రించడం పునరుద్ధరణవాదుల్లో ప్రస్తుత భంగపాటుకు పరిహారంగా ఉపకరించింది. జాతీయవాదానికి ఆవేశము ఆత్మవిశ్వాసము కలిగించింది. మానసిక ప్రవృత్తి నాటి చారిత్రిక రచనల్లో

• గతాన్ని గురించిన అపోహలు – రొమిల్లా థాపర్.

కన్పిస్తుంది. 1930—40లలోని మత రాజకీయాల ప్రభావం వల్ల హిందూ యుగాన్ని స్వర్ణయుగమనీ, ముస్లీము యుగాన్ని క్షీణయుగమని వర్ణించారు. ముస్లిం మతవాదులు గజనీమహమ్మద్ దాడులతోనే భారత దేశ చరిత్ర ప్రారంభమయినది, ముస్లిం యుగం కాఫిర్లపై ఇస్లాం విజయానికి నిదర్శనము అని భావించారు. హిందూ ముస్లిం చరిత్రకారు లిద్దరూ ఒకేతప్పుచేశారు. మతసంఘర్షణే హిందూ ముస్లిం సంబంధాలకు శాశ్వతమయిన కీలక మనేభావం వల్ల మధ్యయుగంలోని సమన్వయ ఉద్యమాలపై దృష్టిమరలించడానికై లౌకిక జాతీయవాదులు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు."

ఈ విధంగా సామ్రాజ్యవాదులు, వారితొత్తులయిన చరిత్ర కారులు, భారతదేశంలో మతాన్ని అడ్డుపెట్టుకొని తమ తమ ప్రయోజనాలకోసం హిందూ ముస్లిములలో కల్గించిన కార్పణ్యంకార్చిచ్చులాగా ఈ నాటికీ రగులుతూవుంది. ఆయామతాలు, మతసంస్థలను వివిధ మార్గాలనుండి పటిష్టం చేసుకుంటూ మత సంఘర్షణలకు కాలుదువ్వుతున్నారు. ఈనాడు సాయుధమతసంఘర్షణకు పాల్పడుతున్న ఈసంస్థలమౌఢ్యాన్ని 1948లోనే 'నార్ల' ఈ విధంగా వ్యాఖ్యానించారు.

"మత మౌఢ్యమే ముస్లింలీగ్ సృష్టికి కారణమయింది. ఇదే హిందూ మహాసభ స్థాపనకు దారితీసింది. ఇదే అకాలీదళ్ అవతరణకు మూలమయింది. పరదాస్యం నుంచి విముక్తిసాధనలో విలంబన తప్పక పోవడానికి, ఆ విముక్తి సందర్భంలో దేశవిభజన అనివార్యంకావడానికి, ఆ విభజన రక్తస్రవంతులమధ్య పూర్తికావడానికి, అన్నింటికిమించి గాంధీ హత్య జరగడానికి ఒకే ఒక హేతువు తిరిగి మన మత మౌఢ్యమే." •

---

• మూడుదశాబ్దాలు— నార్ల వెంకటేశ్వరరావు (1948 మార్చి॥ సంపాదకీయం. (14 వపేజీ)

ఈ మతమౌఢ్యాన్ని ఆర్. యస్. యస్. నాయకులు చాలాతీవ్రంగా పెంచారు. కత్తులు కర్రలతో కవాతులు నేర్పుతూ పసితనంనుండి ఉగ్గుపాలతో క్రైస్తవ, ఇస్లాం మతాలపై ద్వేషాన్ని రంగరించి పోశారు. 'పాంచజన్యం' లో గోల్వాల్కర్ ఈ పరమత ద్వేషానలాన్ని ఏ విధంగారగిలించాడో, ముస్లిములపై హిందువులను ఎలా ఉసిగొల్పుతున్నాడో చూడండి.

"మనం నమ్మిన ప్రతిదాన్ని పూర్తిగా వ్యతిరేకించేటంత లోతుగా నాటుకుపోయింది వారిద్వేషం. మనదేవాలయాలలో పూజలు చేస్తేవారు వాటిని అపవిత్రం చేస్తారు. మనం భజనలు చేసినా రథోత్సవాలు జరిపినా వారికి కంపరమెత్తుతుంది. గోవునుమనం పూజిస్తే వారుభక్షిస్తారు. పవిత్ర మాతృత్వానికి ప్రతీకగా మనం స్త్రీని ఆరాధిస్తే, వారు బలాత్కరిస్తారు."

ఆర్. యస్. యస్. అనే ఈ విషవృక్షం ముస్లిం మతద్వేషాపూరంతో ఆనాటికాలంలోనే ఎంత విస్తృతంగా అభివృద్ధిచెందిందో ఆర్.యస్.యస్. కథారచయిత కె. ఆర్. మాల్కాని ఏ విధంగా వర్ణిస్తున్నాడో చూడండి.

"1940లో శ్రీ గురూజీ సర్ సంఘ్‌చాలక్‌గా బాధ్యతస్వీకరించారు. అప్పటికి ఆర్. యస్. యస్. చిన్న మొక్కమాత్రమే. ఏడుసంవత్సరాల వ్యవధిలో అది పెద్దవటవృక్షమై దేశంలో మూలమూలలకు అక్షరాలా అటక్ నుండి కటక్‌వరకు, కాశ్మీరునుండి కన్యాకుమారి వరకు శాఖోపశాఖలుగా విస్తరించింది. ఈ అభివృద్ధి మహాద్భుతం అనకతప్పదు. దేశంలోని శాసన సభలో తన ప్రతినిధులు లేక పోయినప్పటికి, ప్రతి పాఠశాలలో, కళాశాలలో, ప్రతికార్యాలయంలో, కర్మాగారంలో, అన్నింటికీమించి ప్రజల హృదయాలలో -సంఘంచోటు సంపాదించుకుంది. ఢిల్లీలో ఐ. సి. యస్. అధికారులుకూడ నిత్యమూ హాజరయిన శాఖ ఒకటి ఏర్పడింది." *

---

* ఆర్. యస్. యస్. కథ—కె. ఆర్. మాల్కాని. (52వ పేజీ)



రిజర్వేషన్లు—

ఈ విధంగా అభివృద్ధిచెందిన ఈ సంస్థ అనతి కాలంలోనే దేశం నలుమూలలా వ్యాపించింది.

'వివిధ ప్రాంతాల సంఘ బాలకులలో అగ్రిగణ్యులైన హంసరాజు గుప్తా (ఢిల్లీ) బాబూ ఛిలీప్ చంద్ (పంజాబు), నరేంద్రజిత్‌సింగ్ (ఉత్తరప్రదేశ్,) ఆర్. కె. రస్తోగి (రాజస్థాన్), కృష్ణ భల్లభనారాయణ సింగ్ (బీహార్), సురేంద్రనాధ్‌శర్మ (అస్సాం), బాబాసాహెబ్ బిడే (మహారాష్ట్ర), బాబాసాహెబ్ ఘటాటే (నాగపూర్), డా॥ ప్రాణలాల్ దోషి (గుజరాత్), పి. లింగయ్యచౌదరి (ఆంధ్ర), కె. వి. గోపాలన్ (కేరళ), రంగస్వామితేవర్ (తమిళనాడు) వీరంతా సంఘానికి మూల స్తంభాలు, శక్తి కేంద్రాలు.' [1]

ఈ విధంగా అభివృద్ధిచెందుతున్న ఆర్. యస్. యస్. కు పోటీగా ముస్లింలీగ్ ప్రత్యక్షచర్య దినంనాడు (1946 ఆగష్టు 16) 'మాసర్' అనే బెంగాలీ కరపత్రం చివర మతోన్మాదాన్ని రెచ్చగొడుతూ ఇలా విజ్ఞప్తి, చేయబడింది. "ముస్లింజాతి గర్వించదగిన బహిరంగ పోరాటపురోజు వచ్చింది. స్వర్గమునకు పోదలచినవారు రండి. సామాన్యులు, మనశ్శాంతి కోరెడివారు, కష్టములోఉండినవారు రండి. దొంగలు, గూండాలు, గుణహీనులు, ప్రార్ధనలు చేయనివారు అందరును రండి. స్వర్గద్వారములు మీకై తెరువబడియున్నవి. మనము వేలాది మందిమి కలిసి ప్రవేశింతము. పాకీస్తానులకు జయము కలుగవలెనని, ముస్లిము జాతికి జయమగుగాకయుని, జీహాద్ ప్రకటించిన సైన్యమునకు జయమగుగాక యుని ఎలుగెత్తిచాటుదము." [2]

ఈ విధంగా ముస్లింలీగ్ ప్రకటిస్తు వుంటే, మరొక ప్రక్క గురూజీ యువశక్తిని హింసాయుత కార్యక్రమాలకు పురిగొల్పుతూ

---

1 ఆర్.యస్.యస్. కథ – కె.ఆర్. మల్కానీ (60,61 పేజీలు)
2 ఆర్.యస్.యస్. కథ – కె.ఆర్. మల్కానీ (52,53 పేజీలు)

ఉగ్రగదైవరూపాలను ప్రేరణగా వర్ణిస్తూ మత పాశవికతను ఆర్.యస్ యస్. కార్యకర్తలలో, వారి నెత్తురులో ఎలా రంగరిస్తున్నారో చూడండి

"భారతదేశాన్ని అహింసానిలయంగా అభివర్ణించడం పరిహాస స్పదమని వారు భావించారు. 'మధ్యాసియాలోకి మనం చొచ్చుకు పోగలిగామంటే అది వట్టి కబుర్లతో, ఉపన్యాసాలతో జరిగివుండదు. ప్రతి హిందూ దైవం చేతిలోను ఏదో ఒక ఆయుధం వుండడం గమనించవలసిన విశేషం.' భారతదేశానికి రాజు పురుషోత్తముడిని (గ్రీకు చరిత్రకారుల పోరస్) అలెగ్జాండర్ ఓడించాడనే వాదనను వారు పరిహసించారు. వాస్తవమేమంటే, యుద్ధానంతరం పురుషోత్తముడు అంతకుముందు కంటే ఎక్కువ ప్రాంతాన్ని పలుకుబడిలోకి తెచ్చుకున్నాడు. అలెగ్జాండర్ తోకముడిచి పలాయనం కావలసి వచ్చింది." [1] అని చెప్పారు గురూజీ

ఈ విధంగా హింస ఆయుధంగాగల ఆర్.యస్.యస్. తో అహింస పథంలో నడుస్తున్నామని చెప్పుకుంటున్న కాంగ్రెస్ అంతర్గతంగా చేతులు కలిపి వాడుకుంటూనే వున్నది. భారత ప్రభుత్వం అధికారం స్వీకరించిన తరువాత మంత్రులు తమ తమ బాధ్యతలను స్వీకరించడానికి రాష్ట్రపతి భవన్‌కు వెళుతున్నారు. అపుడు ముస్లిములు కొంత కోపంతో ఉన్నారు. అపుడు కాంగ్రెసు వాళ్ళు కోరవలసింది పోలీసుల సహాయం, కాని ఎవరి సహాయం కోరారో చూడండి.

"మరునాడు మంత్రులు తమ తమ శాఖల బాధ్యతలు స్వీకరించే రోజు. ఆ రోజు ఎటువంటి దుర్ఘటనలు జరగకుండా సాయం చేయవలసిందని ఢిల్లీ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ దేశబంధు గుప్త, ఆర్.యస్. యస్. ఢిల్లీ ప్రాంత ప్రచారక్ శ్రీ వసంతరావుజీకి ఫోన్‌చేసి అభ్యర్థించారు. (అప్పట్లో ఢిల్లీ ఆర్.యస్.యస్. కార్యాలయం కమలానగర్

---

1 ఆర్.యస్.యస్. కథ – కె. ఆర్. మల్కానీ (66 వ పేజీ)

ఆ-42లో వుండేది.) అల్లరేదీ జరగకుండా నివారించడానికై పెద్దసంఖ్యలో స్వయం సేవకులు సెక్రటేరియట్ భవన సముదాయంలో వుండాలనివారు (శ్రీ గుప్త) సూచించారు." [1]

అంటే కాంగ్రెస్ మొదటి నుండి ఆర్.యస్.యస్.తో చేతులు కలిపి ముస్లిముల మీదకి ఎగదోలుతూనే శాంతివాక్యాలు పైకి ఉటంకిస్తున్నారనేది అర్థమవుతూవుంది. అంతేగాక ఆర్.యస్.యస్. యువకులు ఇస్లాం స్వీకరించినట్లు నటించి ఆ సంస్థకు సంబంధించిన రహస్యాలు నెహ్రూకు, పటేల్‌కు అందజేసినట్లు కె.ఆర్. మల్కానీ తన గ్రంథంలో (70వ పేజీ) తెలిపారు. 1947 ఫిబ్రవరి 11వ తేదీ కేంద్ర శాసనసభలో అహమ్మద్ ఇ. హెచ్. జాఫర్ (ప్రశ్న నెం. 178) ఈ విధంగా ప్రశ్నించారు.

ఎ) రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ కార్యకలాపాల గురించి దర్యాప్తు చేయడానికి ఒక కమిటీని నియమించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదా ?

బి) ఆర్.యస్.యస్. ఇటీవల సాగిస్తూన్న కార్యకలాపాలకు సంబంధించి ఏదయినా వినతి పత్రం ప్రభుత్వానికి అందినదా ?

సి) భారతదేశమంతటా సంఘానికి శాఖలు ఉన్నమాట వాస్తవమేనా? గౌరవనీయులైన హోం మంత్రి దయచేసి సమాధానమిస్తారా?

గౌరవనీయులైన హోం మంత్రి సర్దార్ పటేల్ ఇచ్చిన సమాధానాలివి :

ఎ) రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ కార్యకలాపాల గురించి దర్యాప్తు చేసే నిమిత్తం కమిటిని నియమించాలనే ఆలోచన ప్రభుత్వానికిలేదు

బి) అందలేదు

సి) చాలా ప్రాంతాలలో సంఘానికి శాఖలు ఉన్నాయి [2]

---

1, 2 ఆర్.యస్.యస్. కథ – కె.ఆర్. మల్కానీ (69 71, 72 వ పే॥లు)

ఈ విధంగా పటేల్ ఆర్.యస్.యస్. తొత్తుగా సమాధానం చెప్పాడు. గాంధీ మరణానికి ముందు నుండే ఆర్.యస్.యస్.తో అంతర్గత సంబంధాలు కాంగ్రెసులో ముఖ్యుల కున్నాయని ఈ సమాచారం వల్ల మనకు తెలుస్తూవుంది. సర్దార్ పటేల్ చాలా బహిరంగంగా ఆర్.యస్.యస్.ను సమర్థిస్తూ వచ్చాడు. వారిని దేశభక్తులుగా అభివర్ణిస్తూ వచ్చాడు. 1948 జనవరి 6 న లక్నోలో ఆయన ఇలా అన్నారు.

"అధికారంలోవున్న కాంగ్రెసు వారు తమ అధికారం ద్వారా ఆర్.యస్.యస్.ను అణచివేయగలమని భావిస్తున్నారు. దండనీతితో ఏ సంస్థనూ మీరు అణచివేయలేరు. దొంగలకు, బందిపోట్లకు మాత్రమే దండం ఉద్దేశించబడింది. ఆర్.యస్.యస్. కార్యకర్తలు దొంగలుగాని, బందిపోట్లుగాని కాదు గదా! తమ దేశాన్ని ప్రేమించే దేశ భక్తులు వారు"[1]

ఈ విధంగా కాంగ్రెసు సంస్థలో ముఖ్యులు ఈ సంస్థతో గూడు పుఠాణీ చేస్తూ బహిరంగంగా కూడా సమర్థిస్తూ వచ్చారు. చివరకు గాంధీ కూడా తన గుండెల్లో తుపాకి గుండ్లు దూర్చే ఈ దుండగుల సమావేశానికి తాను చనిపోయే ముందు హాజరయ్యారు.

"1947 సెప్టెంబరు 14 న భంగీ కాలనీలోని బహిరంగ స్థలంలో దాదాపు 500 మంది ఆర్.యస్.యస్. కార్యకర్తల నుద్దేశించి ప్రసంగించడానికి గాంధీజీ వచ్చారు. వసంతరావు వారికి స్వాగతం చెప్పి ఆర్. యస్. యస్. లో మాకున్న దైవం ఒక్కటే "భారతమాత" అని చెప్పారు. ఆర్.యస్.యస్. యొక్క క్రమశిక్షణను, ఆదర్శవాదాన్ని గాంధీజీ ప్రసంశించి, ఉన్నతాదర్శాలు, ప్రజాసేవ మీద ఆధారపడిన సంస్థ శక్తివంతంగా, దినదినాభివృద్ధి చెందాలని ఆశీర్వదించారు. తనను

---

1 ఆర్.యస్.యస్. కథ — కె.ఆర్. మల్కానీ (77 వ పేజీ)
2 ఆర్.యస్.యస్. కథ — కె.ఆర్. మాల్కానీ (78 వ పేజీ)



రిజర్వేషన్లు—

సనాతన హిందువు''గా అభివర్ణించుకుంటూ ఆ కార్యక్రమ ప్రారంభంలో పాడబడిన దేశభక్తిగీతాన్ని మెచ్చుకున్నారు గాంధీజీ 1

గాంధీగారి మరణానికి ముందే ఆర్. ఎస్. ఎస్. తో ఢిల్లీకి సంబంధించిన కమాండర్, జనరల్స్‌కు సంబంధంవుంది. ముస్లిములకు వ్యతిరేకంగా సైన్యాధికారులు ఆర్. ఎస్. ఎస్. తో 'మిలాఖత' అయ్యారు.

''భారత స్వాతంత్ర్య-దేశ విభజన నాటి కష్టపు దినాలలో మొదట ఢిల్లీ ఏరియా కమాండర్ జనరల్ రాజేంద్రసింగ్. తరువాత జనరల్ తిమ్మయ్య బాకారాంబా రోడ్‌లోని 20వ నెంబరు భవనంలో శ్రీగురూజీని కలుసుకొన్న విషయం ప్రభుత్వానికి తెలిసేవుంటుందికాని, ఈ కాంగ్రెసు పెద్దలకు బహుశా తెలిసియుండకపోవచ్చు. పరిస్థితిని అదుపులోకి తీసుకొని రావడంలో గురూజీ యొక్క సహకారాన్ని ఆ సైనికాధికారులు అభ్యర్థించారు" 2

ఇది ఎంత దుర్మార్గమయిన విషయమో ఆలోచించండి! మత ఉన్మాదానికి, అధికారులకువున్న సంబంధం ఈ నాటిదికాదు అనేవిషయం అర్థంచేసుకోవలసిన అవసరంవుంది. దేశవిభజనకు మూలకారణం ఆర్. ఎస్. ఎస్. దే బాధ్యత అయివుంది. మైనారిటీ మతాలకు రక్షణలేకుండా వారు అనుసరించిన ఉన్మాదపైఖరే ఇస్లాంమతోన్మాదాన్ని పెంచడానికి, శిక్కు మతోన్మాదాన్ని పెంచడానికి కారణమయింది. ఆనాడు శిక్కులు జాతీయోద్యమంలో బలమయిన పోరాటం చేశారు. భారతదేశ దాస్య విముక్తికి వారి సేవ అద్వితీయమైనట్టిది. వారి ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరమయిన హక్కులయెడవారు చాలాకాలం అవిభాజ్యంగానే పోరాడారు. అయితే ప్రతిమించిన హిందూజాతీయవాదం వేర్పాటువాదానికి బలమయిన పునాది వేసింది. ఈ విషయాన్ని బిపిన్ చంద్రతన "ఆధునిక భారతదేశం"లో ఈ విధంగా వివరిస్తున్నారు

1 2 ఆర్. ఎస్. ఎస్. కథ — కె. ఆర్. మాల్కాని (78 పేజీ)

"రాజకీయాలు సంస్కృతికి సంబంధించిన మత తత్వ దృక్పథం అశాస్త్రీయ మయినదే అయినా, అది అభివృద్ధి నిరోధకచింతనకు బ్రిటిషు ఎత్తుగడలకు పుట్టిన శిశువే అయినా, అల్ప సంఖ్యాక వర్గానికి సహజంగా కలిగే భయాలపైన అది బలంగా పనిచేసింది. అటువంటి పరిస్థితులలో అల్పసంఖ్యాక వర్గాల భయాన్ని పోగొట్టడానికి అవసరమైన ప్రతిచర్య తీసుకోవడం విజ్ఞతా లక్షణం. మతపరంగా అత్యధిక సంఖ్యాకులుగా వుండే వారి దృక్పథం, ప్రవర్తనలద్వారా అల్పసంఖ్యాకుల భయాలు తొలగిపోతాయి."

"సమరశీల జాతీయవాదం అన్ని విధాలా ముందడుగే అయినా జాతీయ సమైక్యతా వికాసంలో వెనుకడుగు వేయడం దురదృష్టకరం. కొంత మంది అతివాద జాతీయ నాయకుల ప్రసంగాలు, రచనలు ఘాటైన హిందూమత వాసనలు కొట్టాయి. వాళ్ళు భారత మధ్యయుగ సంస్కృతిని పూర్తిగా వదిలేసి, ప్రాచీన భారతీయ సంస్కృతినిపైకెత్తారు. భారత సంస్కృతిని, భారతజాతిని హిందూమతంతోను, హిందువులతోను ఏకంచేశారు. సమ్మిశ్ర సంస్కృతిని తమ భావాల్లకు రానీయలేదు. ఉదాహరణకు : తిలక్ మహాశయుని 'శివాజీ, గణపతి ఉత్సవాల ప్రచారం.' 'భారతదేశం తల్లి, జాతీయత, మతం' అనిభావించి రాజ్యాంగ సిద్ధాంతానికి వేదాంతం జోడించిన అరవిందుని అర్ధ ఆధ్యాత్మిక సిద్ధాంతం, కాళీమాత మ్రోల ఉగ్రవాదుల ప్రమాణాలు, గంగానదిలో స్నానాలు చేసి బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమానికి అంకురార్పణ చెయ్యడం వగైరాలు ముస్లిములకు నచ్చలేదు. నిజంచెప్పాలంటే అటువంటిపనులు వాళ్ళమతానికి వ్యతిరేకం. ముస్లిములుగా వాళ్ళు అటువంటి కార్యక్రమాలతో పూసుకు తిరుగుతారను కోవడం పొరపాటు. శివాజీని, రాణా ప్రతాప్‌ని వాళ్ళు నిర్వహించిన చారిత్రక పాత్రల్ని బట్టి మాత్రమేకాకుండా, 'విదేశీయు'లకు వ్యతిరేకంగా పోరాడిన 'జాతీయ' వీరులుగా ఆకాశానికెత్తుతుంటే, అదిచూసి ముస్లింలు నిండు ఉత్సాహంతో ప్రతిస్పందిస్తా

రని భావించడం కూడ శుద్ధపొరపాటు. ఏ నిర్వచనం ప్రకారం అక్బర్, ఔరంగజేబుల్ని విదేశీయులుగా పరిగణించగలము? ముస్లిం మతస్థులు కాబట్టి విదేశీయులని పరిగణించాలా? వాస్తవానికి రాణా ప్రతాప్-అక్బర్ లమధ్య పోరాటాన్నిగానీ, శివాజీ-ఔరంగజేబుల మధ్యపోరాటాన్నిగాని ఆ నాటి నిర్దిష్ట చారిత్రక వాతావరణంలో జరిగిన రాజకీయ సంఘర్షణగా మాత్రమే చూడవలసివుంటుంది. అక్బర్, ఔరంగజేబుల్ని 'విదేశీయు' లుగా, రాణా ప్రతాప్, శివాజీలను "జాతీయవీరులు"గా పరిగణించడ మంటే ఈ 20వ శతాబ్ది మత తత్వదృక్పథాన్ని గతచరిత్రలోకి చొప్పించ టమే ఇదిచెడ్డ చరిత్రయేకాదు, జాతీయ సమైక్యతకు గొడ్డలిపెట్టు"[1]

ఈ వివరణనుబట్టి ఇస్లాంమతోన్మాదాన్ని, వేర్పాటు వాదాన్ని రెచ్చగొట్టింది హిందూ జాతీయవాదులు అనేది స్పష్టంగా తెలుస్తూవుంది. వీరి మతోన్మాదమే దేశాన్ని ద్వయ్యులుగా చీల్చింది. హిందూదేశంలో వున్న ముస్లిములు ఇతర దేశీయులనే ప్రచారంచేసింది ఈ హిందూ జాతీయవాదులే. అంతేగాక స్వతంత్ర భారత దేశంలో కూడ నిరంతర మత మారణానికి ఆర్. యస్. యస్. అనే ఈ పాశవిక శక్తిని పటేల్ వంటి వారు మద్దతునిచ్చి పెంచి పోషించారు. వీరితోవున్న ప్రమాదాన్ని కాంగ్రెస్‌లోవున్న కొంచెం అభ్యుదయంగా ఆలోచించేవారు నిషేధించ డానికి ప్రయత్నించి కొంత కృతకృత్యులయ్యారు. ఆ నిషేధపుటుత్తర్వు నుద్దేశించి మాల్కాని కాంగ్రెసు ఆర్. యస్. యస్.కు భయపడేది అని నిర్భయంగా చెబుతున్నాడు.

"ఆర్. యస్. యస్.ను నిషేధిస్తూ 1948 ఫిబ్రవరిన ప్రభుత్వం జారీచేసిన పత్రంలో రాష్ట్రాల ప్రధానులు, హోంమంత్రి న్యూఢిల్లీలో సమావేశమై 1947న నవంబరులో ఆవిషయాన్ని చర్చించినట్లు అంగీక రించబడింది. అయితే సంఘాన్ని ఒక సంస్థగా పరిగణించి చర్యతీసుకో

---

1 ఆధునిక భారతదేశం—బిపిన్ చంద్ర (235-238 పే॥లు)

దగినదశ ఇంకా రాలేదని అప్పట్లో ఏకగ్రీవంగా అంగీకరించబడటం జరి గింది" అనే నిజాన్ని కూడ ఆపత్రంలో స్పష్టంగా ఒప్పుకున్నారు మరో విధంగా చెప్పాలంటే సంఘాన్ని గాయపరచడాని కయితే కాంగ్రెస్ ప్రభుత్వం సిద్ధంగా వున్నది కాని, గట్టిగా దెబ్బతీయడానికి భయపడు తూవుంది.

దీనినిబట్టి ఆర్. యస్. యస్. వారి అహంకారంమనకు అర్థమ వుతూవుంది. వారు అహంకారంతోనే మహాత్మాగాంధీ రక్తంలో తానమా డారు. మహాత్మాగాంధీ వారికి వ్యతిరేకా? కాదు. అనేకసందర్భాలలో వీరిని సమర్థించాడు. గాంధీ ఉదారభావమే అసలు వీరిని పాలుపోసి పెంచి నట్లయింది. ఆయన గుండెల్లో హిందూతత్వాన్ని నింపుకొన్నప్పటికీ మతసామరస్యాన్ని కోరాడు. అదీ ఆయన చేసిన నేరం. తమను సమర్థించే వారినికూడా, ఏమాత్రం అభిప్రాయ భేదం వచ్చినా చంపడానికి వెను కాడని వారు ఆర్. యస్. యస్. వాళ్ళనేది మహాత్మాగాంధీ మరణంతో ఋజువు అయింది. మానవతకు, దయకు, ప్రేమకు వీరు శత్రువులు. హింస వారి ఆయుధం. రక్త తర్పణం వారిసిద్ధాంతం. రాక్షసత్వం వారికిదారి. రాజ్యాన్ని కబళించడం వారిగమ్యం. అందుకు అడ్డం వచ్చిన వారిని నరికిపారేస్తారు, కాల్చిపారేస్తారు, వారి రక్తంలో తానమాడతారు కాదన్న వారిమీద కసిపడతారు, బుసగొట్టి భయపెడతారు. మహాత్ము లయినా, మహర్షులయినా వారి మతోన్మాద కర్కశ కరాళానికి హతమై పోవలసిందే. స్వరాజ్యం మత సంఘర్షణలలో మతద్వేషానలంతో కూడిన దేశవిభజనల ఆర్తనాదాల హోరులో వచ్చింది. మతమారణంలో రుధిర స్రవంతుల్లో కొట్టు మిట్టాడుతున్న బెంగాల్‌లో పాదయాత్రలో వున్న గాంధీని అత్యంత క్రూరంగా, పాశవీకంగా ఆర్. ఎస్. ఎస్. కార్యకర్త 'గాడ్సే' 1948 జనవరి 30న కాల్చి చంపాడు. అప్పుడు ప్రధాని మంత్రి నెహ్రూ ఆర్. యస్. యస్.ను నిషేధిస్తూ ఉత్తర్వు లిచ్చాడు. 17000 మంది ఆర్. యస్. యస్. కార్యకర్తలను నిషేధించారు ఆర్. ఎస్. ఎస్.



రిజర్వేషన్లు—

ఇంతటిఘాతుకానికి గురైనా, పటేల్ దాన్ని రక్షించడానికే కృషిచేశాడు. ఈ సందర్భంలో నెహూ్రు పటేల్‌కు ఒక లేఖ వ్రాస్తూ—

"బాపూని గాడ్సే హత్యచేసిన విషయంపై ఇక్కడనేగాక బొంబాయి మొదలయిన చోట్లకూడ పరిశోధన కొనసాగుతూనే వున్న ప్పటికీ కుట్రయొక్క విస్తృతత్వాన్ని వెలికిదీయడంలో మాత్రం సరయిన ప్రయత్నం లోపించినట్లు కనిపిస్తున్నది. బాపూజీ హత్య ఏదో చెదురు మదురు సంఘటన కాదని, ప్రధానంగా ఆర్. యస్. యస్. వారు నిర్వహించిన విస్తృతమైన ప్రచారంలో ఇదొక భాగమని, రాను రాను నాకు గట్టిగా నమ్మకం కలుగుచున్నది. చాలామంది ఆర్.ఎస్.ఎస్. వారిని నిర్బంధించడం జరిగింది. వారిలో అధిక సంఖ్యాకులు అంతో ఇంతో అమాయకులే అయివుండవచ్చును. కాని ఆర్. ఎస్. ఎస్. ముఖ్య వ్యక్తులు ఎంతోమంది ఇప్పటికి విదేశాలలోనో, అజ్ఞాతంలోనో వుంటు న్నారు. కొందరు యధేచ్ఛగా తిరుగుతున్నారు. వీరిలో చాలామంది మన కార్యాలయాలలోను, పోలీసు శాఖలలోను వున్నారు. వీరికి తెలియకుండా ఏవిషయాన్నయినా దాచివుంచడం ఎంతమాత్రం సాధ్యంకానిపని. రహస్యంగా సోదాలు జరపడం సాధ్యపడడంలేదని, ఎందుకంటే ఆయా వ్యక్తులకు ఈ సంగతి ముందేతెలిసి పోతున్నదని సీనియర్ పోలీసు అధికారి ఒకరు మొన్ననాతోఅన్నారు."

"ఢిల్లీ పోలీసు వ్యవస్థలో ఆర్. ఎస్. ఎస్. సానుభూతి పరులు చాలామంది వున్నట్లున్నారు. వారందరిపని పట్టాలంటే అంతతేలికయిన విషయంకాదు. అయితే ఇంతవరకు జరిగిన దానికంటే మరికొంత ఏదయినా చేయాలని నేనుభావిస్తున్నాను. ఆర్. ఎస్. ఎస్. సంస్థ ఇంకా ఎన్నోవిధాల సచేతనంగానే వున్నదని, అవకాశం వచ్చినపుడు ఎదురు దెబ్బ తీస్తుందని అనడంలో నాకెంతమాత్రం సందేహంలేదు."

ఈ ఆర్. ఎస్. ఎస్. మతోన్మాదశక్తులు కాంగ్రెస్ మంత్రులలో పోలీసు అధికారులలో బలంగా చోటుచేసుకొని వున్నారనేది నెహ్రూ లేఖ

వలన తెలుస్తూవుంది. నెహ్రూ ఆర్. ఎస్. ఎస్. శక్తులను శిక్షించడంలో కొంత ఉత్సుకతను చూపాడు. కాని ఆనాటి హోంమినిష్టర్ 'పటేల్' వీరికి పూర్తి మద్దతుగావుండి వీరిని రక్షించడం జరిగింది. నెహ్రూ ఆర్. ఎస్. ఎస్. సంస్థ రాజ్యాంగ విరుద్ధ మయినదని గురూజీకి స్పష్టంగా 1948 నవబంరు 10న ఒక లేఖకు సమాధానమిస్తూ పేర్కొన్నాడు. "పైకిచెప్పు కొనే లక్ష్యాలకు పొంతనలేదు. ఆర్. ఎస్. ఎస్.తో సంబంధంవున్న వ్యక్తులు వివిధరూపాలలో నిర్వహిస్తూవున్న కార్యకలాపాలు కూడా అందుకు విరుద్ధంగానే కన్పిస్తున్నాయి. ఆర్. ఎస్. ఎస్. అసలు లక్ష్యాలు భారత పార్లమెంటు నిర్ణయాలకు ప్రకటించనున్న భారత రాజ్యాంగపు పరిచ్ఛేదాలకు పూర్తిగా వ్యతిరేకంగావున్నట్లు కన్పిస్తున్నది. భారత రాజ్యాంగాన్ని ఆమోదించే ప్రతి పౌరుడూ" మేముభారతదేశ ప్రజలము, భారతదేశమును సర్వస్వతంత్ర ప్రజాస్వామిక ప్రజారాజ్యంగా ప్రకటించు నిమిత్తము, మరియు సమస్త పౌరులకు సామాజిక, ఆర్థిక, రాజకీయ, నైతిక న్యాయము, భావస్వాతంత్ర్యము, ప్రకటనా స్వాతంత్ర్యము, సమాన ప్రతిపత్తి, సమానావకాశముల లభ్యపరచుకొను పౌరు లందరిలో ఆత్మగౌరవము, జాతిఐకమత్యము ద్వారా సౌభ్రాతృత్వము నెలకొల్పుట కొరకు ఈ రాజ్యాంగ విధానమును ఆమోదించి, చట్టబద్ధ ముగావించి స్వీకరించుటకు త్రికరణశుద్ధిగా సంకల్పించుచున్నారు." అని ప్రతిజ్ఞ చేయాలి. అయితే, ఈ సూత్రాలన్నిటికి ఈ సంస్థవ్యతిరేక మయినది. వీరు హిందువుల దీదేశం, మిగిలిన వారు వీరి అధీనంలో వుండాలి అనివాదిస్తారు. హిందూధర్మ సూత్రాల ప్రకారం అందరూ సమానంకాదు. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ, మన సంస్కృతికి జీవగర్రలని బోధిస్తారు. హిందూ యేతరులు అంతా ఇతర దేశాలనుండి వచ్చారని సిద్ధాంతీకరిస్తారు. ఇతర మతస్థులను శత్రువులుగా అభివర్ణిస్తారు. అందువల్ల వీరుపూర్తిగా భారతరాజ్యాంగానికి వ్యతిరేకులు. అంతేగాక రాజ్యాంగంలో రానురాను ప్రధాన అంశాలుగా చేరిన ప్రజాస్వామ్యం, సెక్యులరిజం, సోషలిజం అనే ముఖ్య సూత్రాలకు వీరు బద్ధశత్రువులు. హిందూ

నిరంకుశత్వం, హిందూరాజ్యస్థాపన వీరిధ్యేయం. నెహ్రూ నివేదించినట్లుగా ఈ సంస్థ భారత రాజ్యాంగానికి పూర్తిగా వ్యతిరేకమయిన సంఘం. నెహ్రూవంటివారు కొందరు వ్యతిరేకించినా పటేలు మాత్రం ఎప్పుడూ దీనికి కొమ్ముకాస్తూనే వచ్చాడు. ఆర్. ఎస్. ఎస్. నిషేధంలో వున్నపుడు సంఘంలో ఒకడయిన "ఏకనాథజీ'' పటేల్‌ను కలిసినపుడు ఆయన వారిని ఓదార్చుతూ—

"ఈ సంగతి ఆలోచించారా? ఆర్. ఎస్. ఎస్. మీద నిషేధం వుంది. అయితే ఈ నిషేధాలు ఎల్లకాలం వుండేవికావు. కాంగ్రెసు మీదసైతం ఒకప్పుడు నిషేధం వుండేది. ఏమయినా ఈ నిషేధాలతో ఏ సంస్థను హతమార్చలేరు. కనుక ఆర్. ఎస్. ఎస్. మీద ఉన్న ఈ నిషేదం నేడో రేపో తొలగిపోవడం తధ్యం. తర్వాత ఏమిటనేది ప్రశ్న'' అన్నాడు.

అంతేగాక ''నా భావాలు అందుకు భిన్నమని మీరుభావిస్తున్నారా?" అన్నాడు. అంతేగాక పటేల్ ఇంకా ఈ విధంగా అన్నాడు.

''నేను ఈరోజు అనేమాటలను రేపు కాంగ్రెస్ మొత్తం అంటుంది, సంఘటన, సంస్కృతి అంటేనే ఒళ్ళుమండే నెహ్రూవంటివారు కొద్దిమంది వున్నారు. అయితే వారుకూడా దారికి వస్తారు. మీరునాకు చేయూతనిస్తారా అనేది సమస్య."

ఈ విధంగా పటేలు హామీయిచ్చి సహకరించి 1949 జులై 1'న నిషేధం ఎత్తివేయించగలగాడు. తరువాత భారతదేశంలో సోషలిస్టు భావవ్యతిరేకులు ఆర్. ఎస్. ఎస్. కు బ్రహ్మరథంపట్టారు. కమ్యూనిస్టు పార్టీని ఇతర దేశీయ సంస్థగా అభివర్ణించారు. భారతీయ విద్యాభవన్ సంపాదకుడు శ్రీ కె. యం. మున్షీ ఆర్. ఎస్. ఎస్. పై నిషేధం ఎత్తివేసిన తర్వాత కమ్యూనిస్టుపార్టీకి, దీనికి పోలుస్తూ—

సోవియట్ రష్యారథచక్రాలకు అనుబంధించబడివున్న సి.పి.ఐ భారతీయ జాతీయ వాదానికి శత్రువు. ఆర్. యస్. యస్. ప్రాచీన భారతం నుంచి మాత్రమే స్ఫూర్తిని స్వీకరిస్తూ ఉచ్ఛతమ భావావేశంతో భారతమాతను అర్చించే ప్రఖర జాతీయతావాది. ఏదో విప్లవం సాధిద్దామనుకుంటూ సువ్యవస్థితమైయున్న జీవనపు పునాదులను త్రోసిపుచ్చాలని చూస్తుంది. సి.పి.ఐ. విప్లవానికి సౌందర్యం అపాదిస్తు-ప్రమాదకారులుగా చెప్పదగిన ప్రమదల సాహచర్యాన్నియిచ్చి సాధారణ అనుశాసన బద్ధ జీవనంనుంచి పైదొలగివర్తిస్తూ, విశృంఖలతను ఎరగా చూపి యువకులను సి. పి. ఐ. ఆకర్షిస్తుంది. ఆర్. యస్. యస్. సంఘటిత జీవనపు వైభవాన్ని ఆకర్షణగాచూపి హైందవేతరధోరణిపట్ల తీవ్రవైముఖ్యతను కలిగిస్తు యువజనులను ఆకర్షిస్తుంది. భారతదేశంలోని యువతులను సభ్యులుగా చేర్చుకొనే ప్రయత్నం ఆర్. యస్. యస్. ఎప్పుడయినా చేసిందేమొనాకు తెలియదు. లెనిన్, స్టాలిన్, సోవియట్‌యూనియన్‌లను తండ్రి, కుమారుడు పరిశుద్ధాత్మ (Father, Son and Holy Ghost) లు పరిగణిస్తుంది. సి. పి. ఐ. ఆర్. యస్. యస్. కు భారతభూమి దివ్యజనని. ఆమెపాదాలవద్ద రాలిపోవడమేవారికి ధన్యత. సి. పి. ఐ. కి సోవియట్‌యూనియన్ ఎలాంటిదో ఆర్. యస్. యస్. కు ప్రాచీనభారత వర్షం అలాంటిది. భౌతికవాదమే సి. పి. ఐ. వారి మతం. ప్రాచీన పరంపరకు అనుగుణమయిన ధర్మమే ఆర్. యస్ యస్. వారి అభిమతం.'

ఇక్కడ మున్షీగారు కమ్యూనిస్టుల మీద జల్లినబురద మతంకుళ్ళుతో నిండివుంది. పాక్షికధోరణితో కమ్యూనిజం ఆంతర్యం, దానివిశాలపరిధి సిద్ధాంతభూమికను అర్థంచేసుకోకుండాచేసిన విమర్శ అది. కమ్యూనిష్టులను పరదేశసిద్ధాంతాలకు దాసుల్నుగా వ్యాఖ్యానించిన కువిమర్శఅది. ' ప్రపంచకార్మికులారా! ఏకంకండి.' అన్న మార్క్సు ప్రపంచదర్శనాన్ని విలోకించకుండా అన్న మాటలివి. జాతి,కుల, మత తత్వాలతో, అంతస్సంఘర్షణలతో, అస్పృశ్యతా అమానుషంతో అసమసమాజాన్ని నిర్మించు



రిజర్వేషన్లు—

కొని, మత అరాచక సమాజాస్థాపనకు ద్వేషం, క్రౌర్యం ఊపిరులుగా, మానవతా దూరులసమాజాన్ని తయారుచేస్తున్న ఈ సంస్థను గొప్ప దేశ భక్తి సంస్థగా ప్రచారంచేస్తున్నారు మున్షీగారు. భారత దేశం, జాతీయత అంటేసరిపోదు. తరతరాల దాస్యజీవులయిన భారతీయులను గురించి, భారతదేశం గురించి కారల్ మార్క్స్ యిచ్చిన వివరణ చూడండి!

"ఈ సమయంలో అసంఖ్యాకములయినట్టి శ్రమశీలమయిన ఈ పితృస్వామిక నిరపరాధ సామాజిక వ్యవస్థలు వాటి వ్యక్తిసభ్యుల క్రింద విడిపోయి దుఃఖసముద్రములో అల్లాడుతూ, వాటి విడిసభ్యులు ఏక కాలంలో తమనాగరికత యొక్క పురాతన రూపాలన్నీ అనువంశికంగా వస్తున్న జీవనోపాధిని కోల్పోవడమును కళ్ళారాచూడడం మానవ చిత్తానికి ఎంత విషాదకరంగా వున్నప్పటికీ, శాంతిపూరితములయిన ఈ నిసర్గ గ్రామసంఘాలు ఎంతహానిరహితమయినవిగా కనబడుతున్నప్పటికీ, ప్రాగ్దేశపు నిరంకుశత్వానికి ఇవే ఎల్లప్పుడూ గట్టిపునాదులుగా ఏర్పడి వుండేవని, మానవమేధస్సును ఎంత స్వల్పపరిమితులలో యిమిడ్చివుంచ డానికి వీలవుతుందో అంతస్వల్పపరిమితులలో ఇమిడ్చివుంచి, తత్ఫలితంగా మూఢవిశ్వాసాల యొక్క ప్రతిఘటనా రహితమైన పనిముట్టుగా దానిని చేసివేసి, సాంప్రదాయక నిబంధనా శృంఖలాలతో బానిసగా కట్టిపడేసి, దానికున్న వైభవాన్నీ, చారిత్రాత్మక శక్తులనూ పోగొట్టుతూందన్న సంగతిని మనంమర్చిపోకూడదు. ఏ గోష్పాదమంతటి దౌర్భాగ్యపు మడి చెక్కపైనో తనధ్యాన మంతటినీ కేంద్రీకరించి, మహారాజ్యాల వినాశాన్ని అనిర్వచనీయములైన క్రౌర్యాల కొనసాగింపును, పెద్ద పెద్ద పట్నాల జనసంఖ్య ఊచకోతనూ ప్రకృతిసిద్ధ సంఘటనలే అన్నట్టుగా వాటిని గూర్చిపట్టించు కోకుండా ఉదాసీనతతో నిశ్చింతగా చూచి ఊరుకొని. ఆ విషయాన్ని చూడ తటస్థించిన ఏ దురాక్రమణ దారుని చేతిలోనయినా సరే నిస్సహాయస్థితిలోవున్న ఎరగా తానే చిక్కుకొనే అనాగరిక స్వార్థాన్ని మనం మర్చిపోగూడదు. ఆత్మగౌరవహీనమైనట్టి, జడత్వాన్ని కలిగినట్టి,

స్తంభించి పోయినట్టి జీవితం, ఈ సాత్వికమైన మనుగడ, రెండవవైపున తనను కేవలం విరుద్ధమయినట్టి కిరాతక, లక్ష్యరహిత అపరిమిత వినాశకర శక్తుల్ని పురికొల్పి కేవలం నరహత్యనే హిందూస్థానంలో ఒక మతకాండగా పరిగణించబడేటట్టు చేసివేసిందని మనం మర్చిపోకూడదు. ఈ చిన్న చిన్న గ్రామసంఘాలు కులవివక్షతతోను, బానిసత్వంతోను కల్మషపూరితములయ్యాయనీ' పరిస్థితులపై మానవుడు సార్వభౌమాధిపత్యాన్ని వహించేటట్టి ఉన్నతస్థానాన్ని అధిష్టింపజేసేబదులు మానవుడ్ని బాహ్యపరిస్థితులకు లొంగిపోయేటట్టు చేసివేస్తున్నాయని, స్వయం క్రమాభివృద్ధిని పొందే సామాజికస్థితిని నిర్వికారమయినట్టి ప్రకృతి సిద్ధఘటనగా మార్చివేసి, ఈ విధంగా పశుప్రాయం కావించే ప్రకృతి ఆరాధనను, ప్రకృతిపైన సార్వభౌముడయిన, మానవుడు వానరుడయిన హనుమంతుని ఎదుటనూ, గోవు శబలి ఎదుటనూ భక్తితో మోకాళ్ళమీద పడి పూజించేటంతటి నీచస్థితికి మానవుణ్ని దిగజార్చేశాయనే విషయాన్ని మనం మర్చిపోకూడదు.' 1

ఈ విధమైన శాస్త్రీయ వివరణ ఇచ్చిన మార్క్స్ ఒక దేశానికి సంబంధించిన వ్యక్తికాదు–ప్రపంచ దార్శనికుడు. ప్రపంచాన్ని మార్చే సూత్రాలు తెలిపిన తాత్వికుడు. అతడు నిర్మించిన గతితార్కిక చారిత్రక భౌతిక వాదాన్ని ఆధారం చేసుకొని రష్యాలో విప్లవోద్యమాన్ని నడిపించి విజయవంతంచేసిన లెనిన్, స్టాలిన్‌లను వ్యంగోక్తులతో ముస్లిం వంటివారు నిరసించినా ప్రపంచంలో 'మూఢుడవంతులు' మార్క్స్ సిద్ధాంత ప్రభావంతో మార్పు చెందుతూనేవున్నది. లెనిన్, స్టాలిన్ పోరాట పటిమను, విప్లవతేజాన్ని ప్రపంచంలో విప్లవకారులందరూ మార్గదర్శంగా తీసుకొని విజయవంతం అవుతూనే వున్నారు.

మతం మానవుణ్ని నిస్తేజుణ్ని పశువుని చేస్తుంది. మతం పునాదిగా నిర్మింపబడిన ఆర్. యస్. యస్. వంటి ఉద్యమాలు మానవ

---

1 ప్రథమభారత స్వాతంత్ర్యసంగ్రామం - మార్క్స్, ఏంగెల్స్ (1857–1859) నుండి — New yark DailY Tribune 1853 జూన్ 25వతేదీన 3804 సంచికలో మార్క్స్‌చే వ్రాయబడినది.

సమైక్యానికి, మానవతా దృక్పథానికి ముప్పును తీసుకువస్తాయి. అందుకే మార్క్స్ మతాన్ని మత్తుగా అభివర్ణిస్తూ, ఇలా వివరించారు—

The basis of irreligious criticism is:

Man makes religion, religion does not make man. Religion is the self - consciousness and self-esteem of man who has either not yet found himself or has already lost himself again. But man is no abstract being encamped outside the world. Man is the world of man, the state, society. This state, this society, produce religion, an inverted world - consciousness, because they are an inverted world. Religion is the general theory of that world, its encyclopaedic compendium, its logic in a popular form, its spiritualistic point d'honneur, its enthusiasm, its moral sanction, its solemn complement, its universal source of consolation and justification. It is the fantastic realisation of the human essence because the human essence has no true reality. The struggle against religion is therefore indirectly a fight against the world of which religion is the spiritual aroma.

Religious distress is at the same time the expression of real distress and also the protest against real distress. Religion is the sigh of the oppressed creature, the heart of a heartless world, just as it is the spirit of spiritless conditions. It is the opium of the people.

To abolish religion as the illusory happiness of the people is to demand their real happiness. The demand to give up illusions about the existing state of affairs is the demand to give up a state of affairs which needs illusions. The criticism of religion is therefore in embryo the criticism of the vale of tears, the halo of which is religion.[1]

---

1 By Karl Marx, Frederick Engels, Collected works Volume-3, Marx and Engels 1843-1844 page No. 175-176. Contribution to the critique of Hegel's philosophy of law.

మతవ్యతిరేక విమర్శకు ప్రాతిపదిక ఏమంటే. మతాన్ని మానవుడు సృష్టిస్తాడేతప్ప, మతం మానవుణ్ణి సృష్టించదు. మతమంటే తననుతాను ఇప్పటికీ తెలుసుకొని లేదా తెసుకున్నా తనను తాను ఇప్పటికీ మరచిపోయిన త ర హా మనిషియొక్క ఆత్మజ్ఞానము, ఆత్మౌన్నత్యాలే. మా న వు డు ప్రపంచానికి వె లు ప ల నివసించే నిరాకార ప్రాణికాదు. మనిషేమానవ ప్రపంచం, మనిషేరాజ్యం. మనిషే సమాజం. ఈ రాజ్యమే, ఈ సంఘమే, తలక్రిందుల ప్రాపంచక జ్ఞానమైన మతాన్ని సృష్టిస్తాయి. ఎందుకంటే, తలక్రిందులైన ప్రపంచమే మతం. మతమంటే అలాంటి తలక్రిందులైన ప్రపంచంయొక్క సాధారణసిద్ధాంతమే మతమంటే అలాంటి ప్రపంచంయొక్క సర్వసమగ్ర సమాచార సంగ్రహమే. మత మంటే ఆ ప్రపంచాన్ని గురించిన జనరంజక మయిన తర్క విధానమే. ఆ ప్రపంచంయొక్క గౌరవనీయమయిన ఆధ్యాత్మిక అంశమే. దానిఉత్సుకత, దానినైతిక ఆనతి, దాని పవిత్ర సంపూరకము. మతమంటే ప్రపంచం ఉనికియొక్క వకాల్తా సమర్ధనలను గురించిన విశ్వవ్యాపిత మూలాధారము. మతమంటే మానవతాసారాన్ని మితపద్ధతిలో అర్ధంచేసు కోవడం. ఎందుకంటే ఆ మానవతాసారానికి నిజమయిన అస్థిత్వంలేదు. అందుచేత మతానికి వ్యతిరేకంగా సాగించే పోరాటం, మతం ఆధ్యాత్మిక సౌరభముగాకలిగిన ప్రపంచంపైనచేసే పరోక్షపోరాటమే. మతావేదన నిజమయిన ఆ వే ద నా వ్యక్తీకరణే. అదేసమయంలో మతావేదన నిజమయిన ఆవేదనా వ్యక్తీకరణను ఆక్షేపించడం కూడ మతం అంటే అణగ ద్రొక్కబడిన జీవికి నిట్టూర్పు. ఉత్సాహంలేని పరిస్థితులలో ఉత్సాహంశములాగా, మతం హృదయంలేనిలోకంలో హృదయంలాంటిది. మతం మానవుల పాలిటిమత్తుమందు.

భ్రమపూరితానందం వంటి మతాన్ని నిర్మూలించడమంటే ప్రజలకు నిజమయిన ఆనందం కలగాలని కోరడమే. నేడున్నసామాజిక స్థితిని గురించిన భ్రమలు వదులు కోవాలని కోరడమంటే,భ్రమలతో ముడిపడివున్న సామాజిక స్థితి పోవాలని కోరడమే, అందుచేత మతాన్ని



రిజర్వేషన్లు—

విమర్శించడమంటే మతదర్పంగాగల అస్పృశ్య జగతిని ప్రాథమికంగా విమర్శించడమే.

మనిషిని మత్తులో ముంచి చైతన్య రహితుణ్ని చేసే ఈ సురాపానం వంటి మతం గురించి లెనిన్ మహాశయుడు ఈ విధంగా వివరించాడు.

"Religion is one of the forms of spiritual oppression which everywhere weighs down heavily upon the masses of the people, over-burdened by their perpetual work for others, by want and isolation. Impotence of the exploited classes in their struggle against the exploiters just as inevitably gives rise to the belief in a better life after death as impotence of the savage in his battle with nature gives rise to belief in gods, devils, miracles, and the like. Those who toil and live in want all their lives are taught by religion to be submissive and patient while here on earth, and to take comfort in the hope of a heavenly reward. But those who live by the labour of others are taught by religion to practise charity while on earth, thus offering them a very cheap way of justifying their entire existence as exploiters and selling them at a moderate price tickets to well-being in heaven. Religion is opium for the people. Religion is a sort of spiritual booze, in which the slaves of capital drown their human image, their demand for a life more or less worthy of man."[1]

మతం అనేది మానసిక అణచివేత రూపాలలో ఒకరూపం. ఇది అంతటా ప్రజా బాహుళ్యంపై మోయరానిభారాన్ని మోపుతుంది. వారు

---

1 10th Volume - Lenin Collected works - Socialism and Religion Pages 83 & 84

ఇతరుల కోసం శాశ్వతంగా పనిచేయడం, కొరతలు, ఏకాకితనం చేత ఆ బరువు మితిమీరి పోయింది. తమను దోపిడీచేసేవర్గాలకు వ్యతిరేకంగా దోపిడీకి గురవుతున్న వర్గాలు చేస్తున్న పోరాటాలు, వారి నిస్సహాయత, నిర్వీర్యతలు మరణానంతరం వుందని భ్రమించే, మరుజన్మలో సుఖంగా బ్రతుకవచ్చనే ఆశలు చిగురించడానికి అనివార్యంగా ఎలా చిగురిస్తు న్నాయో, తలెత్తుతున్నాయో అలాగే ఆటవిక మనిషి ప్రకృతికి వ్యతిరే కంగా పోరాటాలలో కల్గిన నిస్సహాయత నిర్వీర్యతలు, దేవుళ్ళు, దయ్యా లలో అద్భుతాలు, మహిమలులాంటి వాటిల్లో నమ్మకాలు తలెత్తాయి. జీవి తాంతం కష్టపడుతున్నప్పటికీ కడుపునిండాతిండి కరువయిన కష్టజీవులక ఈ జన్మలో, ఈ భూమిపై ఓపిక పట్టండి, వినయవిధేయతలు కలిగి వుండండి, మరణానంతరం వచ్చే జన్మలో స్వర్గానుభవాలు ప్రాప్తిస్తా యని మతం నమ్మబలుకుతుంది. కాని పరుల శ్రమను దోచుకొని విలాసవంతంగా జీవితాన్ని గడిపే ధనికులకు ఈ జన్మలో కేవలం అడపా దడపా దానధర్మాలుచేస్తూ వుండమని మాత్రమే వారికి మతం ఉద్బో దిస్తుంది. ఆ విధంగా దోపిడీదార్లుగా తమ యావజ్జీవితము గడిపే కారు చౌక మార్గాన్ని వారికి చూపుతుంది. స్వర్గంలో సుఖాలు అనుభవించ డానికి వారికి కారుచౌకలో టిక్కెట్టు అమ్ముతుంది. మతం ప్రజల పాలిటి మత్తు మందు. మతం ఒక విధమైన ఆధ్యాత్మిక సురాపానం. ఈ మతం మత్తులో పెట్టుబడిదారు బానిసలు తమమానవ ప్రతిష్టను మనిషి లాగ యోగ్యమయిన జీవితం కావాలనే తమ డిమాండును గంగలో కలిపి వేస్తారు.

మత సురాపానం వలన ప్రజలకు కలిగే మత్తును గుర్తించి మార్క్సిస్టు దార్శనికులు శాస్త్రీయ అవగాహన కలిగివున్నారు. అందుకే కమ్యూనిష్టులన్నా కమ్యూనిష్టు దేశాలన్నా ఆర్.యస్.యస్. వారికి గుండెదడ. కమ్యూనిజం ఒక దేశానికి పరిమితమయిన ఛాందస జాతీయ వాదం కాదు. ఒక జాతిని మరొక జాతిమీదకు, ఒక కులాన్ని మరొక



రిజర్వేషన్లు—

కులం మీదకు ఉసిగొలిపే వేర్పాటువాదం కాదు. కమ్యూనిజం ప్రపంచం మొత్తంగా పీడితుల్ని, తాడితుల్ని ఏకం చేస్తుంది. ప్రపంచ సామ్రాజ్య వాదాన్ని మొత్తంగా కూల్చుతుంది. దానికి ప్రపంచం మొత్తంగా కమ్యూనిష్టు ఉద్యమానికి పరస్పర సహకారం వుంటుంది. ముఖ్యంగా 'మున్షీ' ఈ విమర్శచేసే నాటికి– "మొదటి సామ్రాజ్యవాద ప్రపంచ యుద్ధం తర్వాత సామ్రాజ్యవాద వలయంలో గండికొట్టి సోవియట్ యూనియన్‌లో మొదటి కార్మికవర్గ రాజ్యం అవతరించింది. ఈ మహత్తర సంఘటనతో, ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఏర్పడ్డ కార్మిక వర్గ రాజ్యాన్ని విప్లవ స్థావరంగానూ, ప్రపంచ సామ్రాజ్యవాదాన్ని నిర్మూలించడానికి లీవర్‌గానూ చేసికొని ప్రపంచ సోషలిష్టు విప్లవం విజయం పొందే అవకాశం లభించింది." అందువలన ప్రపంచ సోషలిష్టు విప్లవానికి లనాడు రష్యా మూలాధారమయింది. సోషలిష్టు ఉద్యమ స్వరూప స్వభావాలు తెలియని ఆర్.యస్.యస్. అనాటి నుండి ఈనాటి వరకు కమ్యూనిష్టు ఉద్యమాన్ని గురించి అవాకులు, చవాకులుకూయడం పరిపాటి అయింది. భారతీయ కమ్యూనిష్టులు ఈ మతోన్మాదంపై చేయాల్సినంత యుద్ధం చేయలేదు. ఆ మత శక్తే కమ్యూనిష్టు ఉద్యమ వ్యాప్తికి అవరోధమైంది.

ఈ హిందూ మతోన్మాదం విషయంలో భారతదేశంలో డా॥ బి. ఆర్. అంబేద్కర్ సరిగ్గా అంచనా వేశాడు.

హిందూ మతాన్ని నిర్మూలించకుండా భారతీయ సామాజిక విప్లవం విజయవంతం కాదని, హిందూ మతోన్మాదం ప్రమాదకరమైందని అంబేద్కర్ నొక్కి వక్కాణించాడు.

భారత సామాజిక విప్లవాన్ని ముందుకు తీసుకుపోయిన బౌద్ధ ఉద్యమంలోకి మానవతా వాదాన్ని ఆయన పరివ్యాప్తం చేశారు. కమ్యూనిష్టులు ప్రాచీన భారత సామాజిక ఉద్యమకారులను, ఆధునిక

సామాజిక ఉద్యమకారులైన మహాత్మాఫూలే, డా॥ అంబేద్కర్, పెరియార్ వంటి వారిని, వారి సిద్ధాంతాలను నిర్లక్ష్యం చేశారు.

దాని ఫలితంగా భారతదేశంలో ఈనాడు మతోన్మాదం చిట్టెం కట్టుకు పోయింది.

మతోన్మాదులు, సామ్రాజ్యవాదుల అండ తీసుకొని మరింతగా బలపడటం ప్రారంభించారు.

సామ్రాజ్యవాద శక్తుల బలమయిన అండతో అభివృద్ధి చెందుతున్న ఆర్.యస్.యస్. దాని నిధులను గూర్చిన లెక్కలు ఎప్పుడూ ప్రభుత్వానికి చెప్పలేదు, చూపించలేదు. కాంగ్రెస్ పార్టీలోవున్న బలహీనతలను ఎత్తి వారిని బెదిరిస్తూ, సామ్రాజ్యవాద దేశాలనుంచి ధనాన్ని ఆయుధాలను యధేచ్ఛగా తెప్పించుకొంటూ, అత్యంత ప్రమాదకరమైన విచ్ఛిన్నకర శక్తిగా ఈసంస్థ అభివృద్ధి చెందుతూవుంది. ఆర్.యస్.యస్. నిధులనుగూర్చి కాంగ్రెస్ అడిగితే, వాళ్లు ఎలా వారినోరు మూయించారో 'మల్కాని' తన గ్రంథంలో యిలా వివరించారు.

ఆర్.యస్.యస్. నిధుల విషయంలో ప్రభుత్వం అభ్యంతరం లేవదీసింది. శ్రీ టి.ఆర్.వి. శాస్త్రి ఈ సంగతి శ్రీ గురూజీకి తెలియజేయగా వారు సమాధానంఇస్తూ "మేమెన్నడూ ప్రజలను యాచించడానికిపోము. లెక్కల పుస్తకాలున్నాయి. సంబంధిత సంస్థ సభ్యులు ఎవరయినా, ఎప్పుడయినాసరే వాటిని చూడవచ్చు. మా కుటుంబపు లెక్కల విషయం బయటివారికి అనవసరం. అయినా సర్దార్ పటేల్ అంత పట్టుదలవుంటే ముందుగా ప్రజలనుంచి కాంగ్రెస్ వసూలు చేసిన నిధుల ఖాతాలను ప్రకటించమని దయచేసి వారితో చెప్పండి. తిలక్ స్వరాజ్ నిధితో మొదలు పెట్టమనండి. ఆ తర్వాతనే మా లెక్కలు ప్రచురించమని ఆయన నన్ను అడగవచ్చు"[1] అని వ్రాశారు.

ఆ తరువాత సంఘ నిధులు విషయమై ఎవరూ నోరెత్తలేదు దొంగలు దొంగలు కలసి ఊళ్ళు పంచుకున్నట్లు మీ లెక్కలు చూపించమంటే మీ లెక్కను చూపించమని ఒకరి నొకరు బెదిరించుకొని ఎవరూ లెక్కలుచూప కపోవడం లోనేవుంది. ఇందరి దగ్గర నల్లధనం వున్నదన్న సంగతి, బిర్లాల, తాతాల అండతో నల్లధనాన్ని పోగేసు కుంటున్నది, ఆర్. యస్. యస్.

"ఈ రోజుల్లో తాతాలను తిట్టటం ఒక ఫ్యాషన్ అయింది. దేశానికి వారు చేసిన సేవలు గ్రహించితే మనకు మరికొంతమంది తాతాల బిర్లాల అవసరం వుందని అర్థమవుతుంది. (ఆర్గనైజర్-12-4-81)" అని విన్న విస్తున్నారు. నిరంతరం అమెరికా భజనలో మునిగి తేలే ఈ ఆర్, యస్. యస్, వారికి కోట్లాదిధనం సామ్రాజ్యవాద దేశాలనుండి ప్రవహిస్తున్న దనేది కనిపిస్తున్న సత్యం.

ఈ విధంగా సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ శక్తుల అండతో పెరుగు తున్న ఆర్. యస్. యస్. దాని రాజకీయశక్తిగా ముందు జనసంఘ్‌ను తర్వాత బి. జె. పి ని ముందుకు తెచ్చింది.

ఆర్. యస్. యస్. యొక్క రాజకీయశక్తి అయిన బి. జె. పి దాని మతవేదిక విశ్వహిందూపరిషత్తు, వాటి విద్యార్థి వేదిక ఎ. బి. వి. పి ఇవన్నీ హిందూరాజ్య స్థాపనకు హిందూమతోన్మాదాన్ని ఈనాడు మరింత రెచ్చగొడుతున్నాయి. వీరి రాజకీయ కుతంత్ర వ్యూహాల్లో భాగమే బాబ్రీ మసీదు- రామజన్మభూమి వివాదం.

# హిందూరాజ్య నిర్మాణంలో

# నెహ్రూకుటుంబం

బాబ్రీ మసీదు రామజన్మభూమి వివాదం వెనుక దాగిన కథనం నెహ్రూ కుటుంబం లౌకికవాద ముసుగులో హిందూరాజ్యాన్ని నిర్మించడం, కాపాడటం అనే అంశాల వ్యూహాల సంబంధాలను, వాస్తవచరిత్ర నుండి సమీక్షించినప్పుడే మనకు అవగత మవుతుంది.

హిందూరాజ్యానికి ప్రతినిధి అయిన ఇందిరా గాంధీకి, పార్సీ మతంలో జన్మించి హిందూరాజ్యాన్ని ప్రశ్నించిన ఫిరోజ్‌గాంధీకి పుట్టిన రాజీవ్, తండ్రి అంత్యక్రియలను హిందూ సాంప్రదాయకంగా నిర్వహించి హిందూ రాజ్యనిర్మాణంలో తన వంతు పాత్రను ప్రారంభించాడు. 20 సంవత్సరాల తరువాత తన సోదరుడు సంజయ్‌గాంధీ అంత్యక్రియలని హిందూమతానుసారం చేయడంతో రాజీవ్‌గాంధీ తన కుటుంబాన్ని పూర్తిగా హిందూ సాంప్రదాయానికి ప్రతీకగా మలిచాడు.

పైకి సర్వమత సమతావాదులుగా ప్రచారమవుతున్న నెహ్రూ కుటుంబవారసుడై రాజీవ్ రోమన్ కేథలిక్ మతానికి చెందిన సోనియా గాంధీని చేసుకున్నప్పటికీ, సిక్కుమతానికి చెందిన మేనకాగాంధీని సంజయ్‌గాంధీ చేసుకున్నప్పటికీ, ఆపరేషన్ బ్లూస్టార్ (స్వర్ణదేవాలయం పై సైనికదాడిని), ఈశాన్య రాష్ట్రాలలోని దళిత క్రైస్తవ ఉద్యమాల పై దాడిని నిర్వహించడంలో... హిందూరాజ్య దురహంకారానికి కొనసాగింపుగా ఇందిర రాజీవ్‌లు తమ పాత్రను తాము నిర్వహించారు.

పాకిస్తాన్ ప్రత్యక్షంగా ఇస్లాంమతరాజ్యంగా రూపొందితే భారత దేశం లౌకికవాదముసుగులో "హిందూ మత రాజ్యంగా'' రూపొందింది. పాకిస్తాన్‌లో ఇస్లామీయులు అధిక సంఖ్యాకులు కావున వారు ప్రత్యక్షంగా ప్రకటించుకోగలిగారు. అయితే భారతదేశంలో ఇస్లాం, క్రైస్తవ, సిక్కు బౌద్ధ, జైన, జొరాస్ట్రియన్ వంటి ఇతర ప్రధాన మతాలుకాక ఎన్నో మతేతరమైన మతరూపాలు మనుగడలో ఉన్నాయి. భారతదేశంలో అత్యధిక 'శ్రామికవర్గం' హిందూ మతేతర మతాల్లోనే ఉన్నారు.

పాశ్చాత్య దేశాల్లో చర్చిని-రాజ్యాన్ని విడి విడిగా ఉంచుతున్నామని, అంతర్గత సంబంధాలను ఏవిధంగా కొనసాగిస్తున్నారో, అదే విధమైన సెక్యులరిజాన్ని నెహ్రూ భారతదేశానికి అన్వయింపజేశాడు. రాజ్యాంగంలో చట్టప్రకారం సమానరక్షణను మాత్రం పొందుపరచి, హిందూమత సాంప్రదాయాన్ని ప్రభుత్వం ప్రత్యక్షంగా ఆచరిస్తూ వస్తుంది. ప్రభుత్వం ప్రచార సాధనాలలో హిందూ రాజ్య సంస్కృతిని బాహాటంగా ప్రచారం చేస్తుంది.

దేశ విభజనకు 20 సంవత్సరాల ముందు-తర్వాత, హిందూ ముస్లిం తగాదాలకు మధ్యవర్తిత్వం వహించిన నెహ్రూ. ఆగ్నేయవాదిగా పిలువబడ్డాడు. మత వివక్షతలేని నెహ్రూ, ఫీరోజ్ ఇందిరల వివాహాన్ని వ్యతిరేకించాడనేది చర్చనీయాంశం అయింది. ఇందిర దళిత-ముస్లింల ఓట్లను కొల్లకొట్టటానికి రాజకీయ నినాదాలు రూపొందించడంలో సఫలీకృతురాలైంది. ఎమర్జన్సీ తర్వాత ఇందిరాగాంధీ తన హిందూమత తత్వాన్ని బాహాటంగానే ప్రదర్శించింది. ఎన్నికల తేదీలను ప్రకటించడానికీ, నూతన ప్రభుత్వాలు పదవీస్వీకారాలు చేసేముందు జ్యోతిష్యులను సంప్రదించి నిర్ణయాలు చేయడం ఇందిరాలోని అంతర్లీనంగానున్న మత ఛాందస భావాలను వ్యక్తీకరించాయి. దక్షిణఢిల్లీ యమునా నది వొడ్డున బృందావన్ ప్రాంతంలో. భూమికి ఆరుఅడుగుల ఎత్తులో, చెక్కలతో నిర్మించిన మంచెపై ఉండే 'దేవరాలబాబా' అనే హిందూ యోగి

ఆశీర్వాదాలు పొందేందుకు ఆమె ఎన్నో సార్లు వెళ్ళింది. ఇందిరా తన ఎన్నికల ప్రచార యాత్రలో....బాబాలను, దేవాలయాలను సందర్శించటం పరిపాటిగా జరిగేది. స్వర్ణదేవాలయంపై జరిగిన సైనికదాడితో, ఆమెలోని మైనారిటీమతాలయెడల వ్యతిరేకత స్పష్టమైంది. ఆ చర్యతో భారత దేశంలోని మైనారిటీలు ఇందిరాగాంధీ ప్రభుత్వాన్ని హిందూ ప్రభుత్వంగా భావించటానికి కారణమైంది.

అందుకే మతోన్మాదం రాను రాను ఫాసిజంగా మారుతున్న విషయాన్ని సయ్యద్ షాబుద్దీన్ ఇలా వివరించారు.

" Communal polarisation which has been deliberately nurtured over the last ten years, was reached an unprecedented level. Communalism is no longer the petty Communalism of yesterday. It is organised chauvanism of today which will hand us one day into the dark night of the Fascism.

ఇందిరాగాంధీ హత్యానంతరం ఢిల్లీలో జరిగినవేలాది మంది శిక్కుల ఊచకోతలో **R S S** వాళ్ళ పాశవిక దమనకాండ హిందూ రాజ్య ప్రతినిధిగా ఇందిరాగాంధీని వారు గుర్తించిన విషయాన్ని రుజువు చేస్తుంది. జైల్‌సింగ్ హృదయం గాయపడినప్పటికీ హిందూ రాజ్య భాగస్వామిగా ఉన్నంత కాలమే ఆ యన ప్రధాన పాత్రలో మనగలిగాడు. ఆ తరువాత రాజ్యానికి వచ్చిన రాజీవ్ గుజరాత్‌లోని అంబాజీ దేవాలయాన్ని సందర్శించిన తరువాత పది సం॥ల క్రితం తన తల్లికూడ అంబాజీ దేవాలయం నుండే తన ఎన్నికల ప్రచారం ప్రారంభించిందని, అందుకే ఆమె గెలిచిందని రాజీవ్ ఈ దేవాలయాన్ని సందర్శించిన తరువాత చెప్పాడు. పైకి లౌకికవాదిగా తన్ను తాను పిలుచుకుంటున్న రాజీవ్ యొక్క హిందూ హృదయం మనకు అర్థం అవుతుంది. ఈ ప్రచార యాత్రలో సోనియా కూడ రాజీవ్‌తో ఉండటంతో హిందూ సంస్కృతిలో ఆమెకూడ భాగస్వామి అయింది.

ఈ నేపథ్యంలో హిందూ మతోన్మాదుల రక్తపాత పునాదుల నుండి పాలన ప్రారంభించిన రాజీవ్ హిందూ రాజ్య ప్రతినిధిగా బాహాటంగానే వ్యవహరిస్తూ వచ్చాడు.

## బాబ్రీ మసీద్ - రామజన్మభూమి వివాదం

1528 నుండి ఈ వివాదం వెనుక పెద్ద చరిత్ర ఉంది. మొఘల్ చక్రవర్తి బాబరు ఈ పట్టణంలో ఆగినప్పుడు ఇక్కడ మసీదు నిర్మించాలని నిర్ణయించాడని హిందువులు ఆరోపిస్తున్నారు. రాముని జన్మస్థలంలో నిర్మించిన హిందూ దేవాలయాన్ని నాశనంచేసి ఈ మసీదును నిర్మించారని కాకమ్మకథ (Legend) చెపుతుంది. బాబరు మసీదును నిర్మించిన స్థలంలో అంతకు ముందు హిందూ దేవాలయమేదిలేదని ముస్లింలు ఈ కథనాన్ని ఖండించారు. బాబర్ హిందువులను ఆదరించాడని ఎన్నో హిందూ దేవాలయాలను సందర్శించాడనీ చరిత్రకారులు చెపుతున్నారు.

1949 డిసెంబర్ 23న మసీదులో రెండు హిందూ విగ్రహాలు ప్రత్యక్షమయ్యాయి. అంతవరకు ఎటువంటి కల్లోలమూ జరగలేదు. రాత్రిపూట మసీదు గేటు తాళాన్ని పగులగొట్టి 50 మంది హిందువులు లోనికి ప్రవేశించి విగ్రహాలను మసీదులో ఉంచారని జిల్లా మేజిస్ట్రేట్ అంటున్నప్పటికీ రాముడే అక్కడ విగ్రహాలనుంచాడని హిందూ మతవాదులు వాదిస్తున్నారు. 9 రోజులు ఆవరణ వెలుపల హిందూ యజ్ఞం జరిగిన తరువాత ఈ నమ్మకం హిందూవుల్లో మరింత బలపడింది. అక్కడ శాంతిని పరిరక్షించడానికి జిల్లా మేజిస్ట్రేట్ మసీదు మూసివేయమన్నప్పటికీ 16 నెలల తరువాత హిందువులకు ఆ మసీదు వెలుపల పూజలు జరిపే హక్కు ఇవ్వబడింది.

ఈ సంఘటనతో భయభ్రాంతులైన ముస్లింలు ఎంతో మంది అయోధ్యనుండి వెళ్ళిపోయారు. ఉపఖండ విభజన జరిగిన 2 సం॥లకే హిందూ ముస్లింలు ఒకరినొకరు ఊచకోత కోసుకున్నారు.

1985 లో ఈ పుణ్యక్షేత్రాన్ని తిరిగి తెరవాలనే పిటిషన్‌ను అనుమతించడం ద్వారా చాలాకాలంగా ఉన్న ఈ వివాదాన్ని మళ్ళీ వెలుగులోకి తేవడమే కాక రాజకీయ రంగంలోకి కూడా ఈ వివాదం లాగారు. హిందువులు తమ రెండు వాదనలపైనే నిలిచారు. (అవి నిజమని ఋజువు కానప్పటికీ) మసీదు రామజన్మస్థలంలో వుంది. మసీదు నిర్మించడానికి హిందూ దేవాలయాన్ని నాశనం చేశారు. మసీదు ప్రాచీన కాలపుదనీ, 400 సం॥ నుండే ఇందులో ప్రార్థిస్తున్నారనీ తమ వాదనను ముస్లిములు సమర్థించుకుంటున్నారు. కాని 1949 వరకు ముస్లింలు హిందువులు ప్రక్కప్రక్కనే ప్రార్థనలు జరిపారు. తరువాత మసీదు వెలుపల ఒక చిన్న పుణ్యక్షేత్రాన్ని ఉపయోగించసాగారు. మసీదులోకి అనుమతించాలని వేసిన పిటిషన్‌ను విశ్వహిందూపరిషత్‌వంటి హిందూ మతోన్మాద సంస్థలు బలపరిచాయి.

"అయోధ్య" చరిత్రలో రాజీవ్ మొదటినుండే భాగస్వామ్యం పంచుకున్నాడు. రాజీవ్‌కు కాంగ్రెస్ సహచరునిగా ఉండి, తరువాత జనతాదళ్‌లో చేరిన అరుణ్ నెహ్రూ చెప్పిన ప్రకారం కాంగ్రెస్ హై కమాండ్ 1986 లో చేసిన నిర్ణయం ప్రకారం 'హిందూ ముసుగును;' అదే విధంగా ముస్లిం మహిళాబిల్లుతో ముస్లిం ముసుగును వేసుకోవాలనుకున్నారు. అరుణ్‌నెహ్రూ చెప్పిన ప్రకారం ముస్లిం స్త్రీ బిల్లుకు 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ'గా అయోధ్యను ఉపయోగించారు. 1989 ఆగస్ట్‌లో అక్బర్-ఇన్-అనే ఢిల్లీ ఉర్దూ పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో క్రొత్తగా తాళం వేయబడిన పుణ్యక్షేత్రంలో హిందువుల దేవుళ్ళ బొమ్మలను టి.వి. లో చూపించి రాజీవ్ 'హిందూ ముసుగు' వేసుకొని తనవంతు ప్రధాన పాత్ర చక్కగా పోషించాడు.

తన సహచరుని అసలు రూపాన్ని చూపించాలని ఉబలాటపడిన అరుణ్ నెహ్రూ ఎలక్షన్ ముందుగా 'ఇది ప్రమాదకరమైన విషయమని నాకు తెలుసు అందుకే నేను దీన్ని అంగీకరించలేదు' అని అన్నాడు.

అయోధ్య వివాదం ఇంతకు మునుపెన్నడూలేని విధంగా భారతదేశపు రెండు ప్రధాన మత బృందాలను చీల్చి సంఘర్షణకు గురిచేసింది.

మతానికి ప్రభుత్వానికి సంబంధంలేదని సెక్యులరిజం చెబుతున్నప్పటికీ, హిందూమత ఆధిక్యతకులోబడి మైనారిటీ మతాలవారు జీవించాలనే అర్ధాన్ని సెక్యులర్ అనే పదానికి అన్వయం చేయాలని ప్రయత్నించడం జరిగింది.

హిందూ అఖండ భారతవాదులు ప్రత్యక్షంగా హిందూరాజ్యాన్ని కోరుతుంటే రాజీవ్ గాంధీ పార్టీ పరోక్షంగా హిందూ రాజ్యాన్ని సంరక్షిస్తుంది.

హిందూ సంస్కృతిలో భాగం గాని మైనారిటీలపైన దాడులు చేస్తున్న హిందూమతోన్మాదుల చర్యను ప్రభుత్వంచూస్తూ ఊరుకున్న కారణంలో అంతరార్థం ఇదే.

1989 జనవరి నుండి సెప్టెంబర్ వరకు 336 మంది ముస్లింలు హిందూ మతోన్మాదుల దాడిలో చంపబడ్డారు. ఇంతవరకు పట్టణాలలో జరిగే దాడులు ఇప్పుడు గ్రామాలలోకూడ జరుగుతున్నాయి. ఉత్తర ప్రదేశ్‌లోను, బీహార్‌లోని భగల్పూరులోను అధికారులు చెప్పుతున్న లెక్క ల ప్రకారం రెండువందల మందిపైగా మతఘర్షణల కాల్పుల్లో చనిపోయారని తెలుస్తుంది.

నిజానికి 800 మంది అదృశ్యం అయినట్లు 'రేడియన్స్' పత్రిక నవంబరు 12 సంచిక చెబుతుంది. 1987 లో బాబ్రీ మసీదు రామజన్మ భూమి వివాదంలో దేశవిభజన తరువాత గిరిజన హిందూ ముస్లిం గొడవల్లో ఇది పెద్దది. ఉత్తరప్రదేశ్‌లో హిందూ యాజమాన్యంలోవున్న జౌళి పరిశ్రమల్లో ముస్లిమ్ కార్మికులు శ్రమశక్తిని ధారబోస్తున్నారు. ఉత్తరప్రదేశ్‌లో కోటికిపైగావున్న ముస్లిం శ్రామికులపై పెత్తనాన్ని

స్వీకృతం చేసుకోవటానికి హిందూ పెట్టుబడిదార్లు చేస్తున్న కుట్రలో భాగంగా కొద్ది రోజుల్లోనే ఈ మత విద్వేషాగ్ని అల్లుకొని ఢిల్లీ వరకు వ్యాపించింది.

ఉత్తరప్రదేశ్ PAC పోలీసు జవానులు నిష్పక్షపాతంగా రక్షణ కల్పించాల్సిన బాధ్యత మరచిపోయి ముస్లింలను ఊచకోత కోశారు.

ఒకే ఒక్క సంఘటనలో ముస్లింలను ఈ పోలీసులు 50 మందికి పైగా చంపారంటే, ఎంత దారుణంగా ఈ మారణం జరిగిందో ఊహించాలి. ఉత్తరప్రదేశ్‌లో అగ్రకుల పెత్తందార్లు హిందూ పెట్టుబడిదార్లు, PAC వారు కలిసి ముస్లింల మీద ఈ మారణకాండ నిర్వహించారు.

బి.జె.పి., ఆర్.యస్.యస్. ప్రత్యక్షంగానే ఈ దాడులను నిర్వహించగా కాంగ్రెస్ చిరునవ్వుతో నిలబడి చూసింది. రాజీవ్ గాంధీ మీరట్ వచ్చిన సందర్భంలో PAC పోలీసు జవానులు జిందాబాద్ PAC వర్ధిల్లాలని నినాదాలిచ్చారు. 1984 లో ఇందిరహత్యానంతరం ఢిల్లీలో జరిగిన దాడుల్లో శిక్కులు ఏ విధంగా రక్తసిక్తమయ్యారో ఇప్పుడు ముస్లిమ్‌లు అదేవిధంగా దాడులకు గురయ్యారు. రానురాను మైనారిటీలు జీవించే హక్కును కోల్పోతున్నారనడానికి ఈ దాడులే నిదర్శనము.

## బి. జె. పి. మత మారణం

హిందూ సనాతన సాంప్రదాయ వాదుల చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ రోజు అక్టోబరు 30, (1990.) భారతరాజ్యంలో హిందూ తత్వమనేది ఈ రోజునే నిలబడిందని హిందూ చరిత్రకారులు గర్వంగా చాటుకున్న రోజు ఇది.

అక్టోబరు 30 మతోన్మాదానికి ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడే వారికి ఒక దుఃఖార్తమైన రోజు.

ములాయంసింగ్ పోలీసులు బాబ్రీమశీదును రక్షించి నందుకు కాదు. బూర్జువాపత్రికా సంపాదకీయాల్లో రాసినట్లు భారత రాజ్యం ప్రమాదంనుండి తప్పించినట్లు కాదు. కాని అక్టోబర్ 30 మనకు మంచి గుణపాఠాలు నేర్పింది. ఎందుకంటే అక్టోబర్ 30 రాబోతున్న భారతాన్ని మన కళ్ళకు కట్టింది. ప్రజాస్వామిక వాదుల, వామపక్షవాదుల నిర్లక్ష్యం హిందూ మతోన్మాదం ఈ దశకురావటానికి కారాణమైంది. అందుకే హిందూ మతోన్మాదుల దుర్వ్యూహాన్ని శాస్త్రీయంగా విశ్లేషిస్తేకాని భారతదేశ వర్తమానం భవితవ్యం అర్థం కాదు. ఈ విషయంలో మనం అశ్రద్ధ చేస్తే చరిత్రలో రక్తపుమరకలే మనకు మిగులుతాయి.

**RSS**, విశ్వ హిందూ పరిషత్, **BJP** లు మశీదుస్థానంలో రామమందిరాన్ని కట్టగలరని ఆశించారు. కాని బాబ్రీమశీదు కూల్చుటయే నిజమైన కుట్ర. బాబ్రీ మసీదును కూల్చడం అవసరమేనని సాధరణ హిందువులను కూడా వాదనలోకి దించగలిగారు. **VHP** జాయింట్ సెక్రటరీ ఆచార్యగిరిరాజ కిషోర్ నవంబర్ 20వ తేది పత్రికలవారితో మాట్లాడుతూ మేమేకనుక మసీదును కూల్చివేయాలనుకుంటే చాలతేలికగా ఆపనిచేయగలిగి ఉండేవారమని అన్నారు.

చరిత్రలో అనేక మతాల మీద హిందూ మతోన్మాదులు చేసిన దాడుల్లో ఆయా కాలాల్లోగల ప్రభుత్వాలేవి ఆపలేక పోయాయి. ఈనాడు హిందూ మతోన్మాదులు చేస్తున్నదుర్వ్యూహం వెనక ఎంతో ప్రమాదకర మైన కుతంత్రం ఉంది. వీళ్ళు హిందువులను మైనారిటీలకు మధ్య రక్తరేఖను గీసి పౌరుల మధ్య పోరాటనికి సన్నిద్ధంచేస్తున్నారు. మసీదు ను ఎదురుగా చూపించి హిందూమతోన్మాదాన్ని రెచ్చగొట్టడమే అసలు వ్యూహం. భారతదేశంలోని ప్రతిగ్రామం నుండి రామశిలలను అయోధ్యకు (1990) పంపడం ద్వార గ్రామ భారతదేశాన్ని మత విద్వేషంలోకి నెట్టడానికి విశ్వహిందూ పరిషత్ ప్రయత్నించింది.

ఏకాత్మతాయజ్ఞంద్వారాను. గంగాజలాన్ని గ్రామాలకి పంచడంద్వారాను. ఈ సంవత్సర దీపావళిలో రామజ్యోతులను గ్రామ గ్రామలలో ఊరేగించడం ద్వారాను, సోమనాథ్ నుండి అయోధ్యవరకు రధయాత్రచేయడం ద్వారాను, అక్టోబర్‌లో జరిగిన కరసేవకు పెద్ద ఎత్తున కరసేవకుల్ని సమీకరించడం ద్వారాను, ఇప్పుడు కరసేవలో చనిపోయిన వారి చితాభస్మాన్ని భారతదేశంలో నలుమూలలా పంచడం వంటి కార్యక్రమాలన్ని నిర్మాణంలోకి తీసుకురావటానికే అనుసరించిన ఎత్తుగడలు. వీటిద్వారా మసీదును ఎదురుగా నిలబెట్టి తాము చిందిస్తున్న రక్తపాతాన్ని చూడకుండా హిందువులకళ్ళుగప్పగలిగారు. ఈ ఉన్మాదులు.

## రెండవ వ్యూహం

రాజ్యాంగ యంత్రంలో చీలికలు తీసుకొచ్చి మతోన్మాదంపై పు అత్యధిక వర్గాన్ని ఆకర్షించడానికే మందిర్ – మసీద్ అంశాన్ని వాడుకున్నారు.

ఈ వ్యూహాన్ని నాయకత్వం వహించడానికి ఇప్పుడు టి.వి యస్.పి. ఉపాధ్యక్షుడు మాజీ డి.జి.వి. అయిన S. దక్షిత్ వంటి ఉన్నత ప్రభుత్వ ఉద్యోగులను విశ్వహిందూ పరిషత్ వినియోగించడం ద్వారా ప్రభుత్వ యంత్రాంగంలో పైరుధ్యం తేవడంలో చేసిన ప్రయత్నం అర్థం అవుతుంది. **UHP** పారామిలటరీ దళాలను, పోలీసులను ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలని పిలుపు నివ్వటం మనం గమనించ దగ్గవిషయం. పోలీసులకు వారిచ్చిన నినాదాల గురించి వ్యాఖ్యానిస్తూ "దివాయిస్ ఆఫ్ పీపుల్స్ ఎవేకినింగ్ అనే పత్రికా సంపాదకుడు ఆనంద్‌కుందా" ఇలావ్యాఖ్యానించారు.

"ఇప్పుడు సాధువులు పిలుస్తున్నారు కరసేవను జవానులే చెయ్యాలి" అని, "ఇది రహస్యం, పోలీసులు మాతోనే ఉన్నారు"

ప్రధాని ఆఫీసులోకి కూడాచొచ్చుకొని పోగలిగిన **R S S** సానుభూతిపరులు పెద్ద అధికారులు సహాయంతో అశోక్‌సింఘాల్ అయోధ్యలోకి ఏ విధంగా వెళ్ళగలిగాడో గుర్తు చేసుకోండి. మతోన్మాదంతో నిండిపోయిన కొందరు పోలీసు అధికారులు "రామా మేంకూడ వస్తున్నాం" అని నినాదాలిస్తూ కరసేవకులతో కలసిపోయిన విషయాన్ని గుర్తుచేసుకోండి. రక్షణసిబ్బంది తో ఆప్యాయంగా మాట్లాడి, కరసేవకులు వారికి తిలకందిద్ది, వారిస్థానాల నుండి పై దొలిగే విధంగా ఎలా ప్రవర్తించారో గమనించండి. ఢిల్లీలోని ట్రాన్స్‌మీటర్ నుండి కర సేవకులు సూచనలు పొందగలిగారు. కేవలం ప్రభుత్వ యంత్రాంగంలోని పెద్ద అధికారులతో మిలాఖత్ అయితేనే ఈ పని సాధ్యంకాగలదు. అరెస్టు చేయబడ్డ కరసేవకులు మళ్ళీస్వేచ్ఛగా తిరగటానికి ఏ విధంగా అను మతించారో మనం గమనించగలగాలి"

పోలీసుల్లో మత తత్వాన్ని రేపి వారికార్యాచరణకు మత విశ్వాసాలకు మధ్య వైరుధ్యాన్ని సృష్టించడం, ఈ మత తత్వాన్ని వ్యతిరేకించే ప్రభుత్వ వుద్యోగులను పోలీసుల్ని ఏకాకులను చేసి మతోన్మాదుల చేత సెక్యులరిస్టులను హేళన చేయించి మతోన్మాదాలను జాతిసిద్ధాంతం అత్యున్నతమైనదిగా ప్రచారం చేసుకోవటంలో వీరు కృతకృత్యమవటమే కాక హిందూ భావనలేని వారు ఈ దేశీయులు కాదనే ప్రచారాన్ని కూడా వారు ముమ్మరం చేయగలిగారు.

## మూడవ వ్యూహం

హిందూ మతోన్మాదం సృష్టించి వారితో మూర్ఖులను దురుసుగా వ్యవహరించే వారిని ఏరి, అటువంటి వారికి సాయుధ శిక్షణ ఇప్పించటం మైనారిటీలను, దళితులను ఊచకోతకోసి, భయభ్రాంతులను చేసి వారిపై పెత్తనం సాధించటం వారి లక్ష్యం. ప్రభుత్వ సాయుధ దళాలను ఎదుర్కొని చొచ్చుకుపోవడంలో వారిశక్తిని నిరూపించుకుంటానికి **R S S**, విశ్వ హిందూ పరిషత్, **B J P** లు అయోధ్యలో కరసేవను పరీక్షాకేంద్రంగా మార్చుకున్నారు.

ప్రభుత్వ యంత్రాంగంలో ఉండే తమ వర్గంవారు తమకు ఎంతవరకు తోడ్పడతారనే విషయాన్ని కూడ వారు పరీక్షించుకున్నారు.

వార్తాపత్రికల సమాచారం ప్రకారం హిందూమత తత్వసంస్థ అయిన భజరంగ్‌దళ్ పదిలక్షల మంది యువకులకు సాయుధ శిక్షణ యిప్పించడానికి సమీకరించింది. హిందూ మతతత్వ సంస్థలతో ప్రత్యక్ష సంబంధాలు కలిగియున్నా మాజీమిలటరీ, పోలీసు అధికారులు ఈ సాయుధ శిక్షణకు నిర్వాహకులుగా వ్యవహరిస్తున్నారు.

ఈ ఆగ్రహం, క్రోధం అంతా మతోన్మాదులకు వ్యతిరేకంగా ఎవరైతే మాట్లాడుతున్నారో వారి మీద ఎక్కుపెట్టబడింది. అక్టోబర్ 30 తరువాత కొద్దిరోజులకు బొంబాయిలోని జనతాదళ్ ఆఫీస్‌ను తగలబెట్టారు. నవంబర్ 15న " భారత జనవాది అగాడి " కార్యకర్తలపై దాడి చేశారు.

నవంబర్ 16న బొంబాయిలో ఒక స్కూల్లో విశ్వహిందూ పరిషత్‌కు చెందిన టీచర్ స్టిక్కర్లు పంచుతుండడాన్ని ఒక విద్యార్థి తండ్రి ప్రశ్నించగా ఆయన ఇంటిపై దాడిచేసి అన్యాయంగా ప్రవర్తించారు. నవంబర్ 19న ఒక బహిరంగ సభలో **C.P.M; M.P** సుహాసినీ అలీని మెడబెట్టిగెంటి అసభ్యంగా ప్రవర్తించారు.

మెట్రోపాలిటన్‌సిటీ అయిన బోంబాయిలోనే వారి దురాగతాలు ఇలా ఉంటే ఇక గ్రామీణ భారత భవితవ్యంరాబోయే కాలంలో రాబందుల మయంకాక ఏముంది?

## మతోన్మాదుల అంతిమ లక్ష్యం

వామపక్షవాదులు, ప్రజాస్వామికవాదులు, సెక్యులర్ భావవాదులు బి. జె. పి. విశ్వహిందూపరిషత్, **R S S** బజరంగదళ్ వంటి సంస్థల అంతిమలక్ష్యంమీద సరైన అంచనా లేకుండా, కేవలం **B J P** ఓట్లద్వారా



రిజర్వేషన్లు—

అధికారంలోకి రావటానికే రామమందిర వివాదాన్ని ప్రయోగిస్తుందని వ్యాఖ్యానిస్తున్నారు.

కానీ ఈ హిందూ రాజ్యవాదుల అంతిమ లక్ష్యం సాయుధ హిందూ దళాల ద్వారా హింసాత్మకంగా సెక్యులర్ ముసుగులోవున్న ఈ హిందూ రాజ్యాన్ని కూల్చి హిందూ నియంతృత్వ రాజ్యాన్ని స్థాపించాలనేదే అసలు వీరి లక్ష్యం. పైన మనం చర్చించిన దానిలోని సారభూతమైన అంశాలు ఏమంటే ?

1. ప్రజల్ని మతోన్మాదులుగా రూపొందించటం.
2. ప్రభుత్వ యంత్రాంగంలో చీలికలు తెచ్చి వారిలోని మతోన్మాద శక్తులను ఏకం చేయటం.
3. సాయుధ నియంతృత్వ దళాలను ఏర్పర్చటం. ఈ మూడు కార్యక్రమాల ద్వారా రక్తపాతంతోనే రామరాజ్య స్థాపనకు వారు పూనుకుంటున్నారు.

బి.జె.పి., విశ్వహిందూ పరిషత్, ఆర్.యస్.యస్. ల కూటమి కేవలం ఓట్ల రాజకీయాల కోసమే ఈ వ్యూహం పన్నారనే భ్రమను వదిలించుకొని వారి సాయుధ వ్యూహాన్ని రక్తపాత రాజ్య నిర్మాణాన్ని అర్థంచేసుకొనవలసిన అవసరముంది.

ఈ హిందూ మతోన్మాదులు ప్రజాస్వామిక రాజ్యాధికారాన్ని కోరడం లేదు. వీరి హిందూ రాజ్యం నియంతృత్వమైంది. అందుకే వారు ఈనాటి కోర్టులను, చట్టాలను పరిగణలోకి తీసుకోకుండా వారి పద్ధతిలో వారు ముందుకెళ్ళుతున్నారు. వీరి మత నియంతృత్వ పోకడలను వ్యతిరేకించే కలెక్టర్లను, పోలీసు అధికారులను, జడ్జిలను వారు వేధిస్తూ, దాడులుచేస్తూ భయకంపితులను చేస్తున్నారు. హిందూ మతోన్మాద సాయుధ దళాలకి ప్రభుత్వ యంత్రాంగలోవున్న మతోన్మాదులకి సయోధ్య కుదిర్చారు. హిందూ సాయుధ అరాచక దళాలకు ప్రభుత్వ యంత్రాంగం నుండి కూడా రక్షణవలయాన్ని రూపొందించుకోగలిగారు. వీరి కుట్రలను బహిర్గతం చేయడానికిపెట్టే బహిరంగ సభలను, ప్రదర్శ

లను వీరు హింసాత్మకంగా విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. వీరి గుట్టు బయటపెట్టే పాత్రికేయులను, రచయితలను హింసించటం పరిపాటి అయింది. ఉపన్యాసకులకు, మేధావులను వారు ఆయుధాలతో నోరు మూయిస్తున్నారు.

ప్రజల్లో మతోన్మాదాన్ని నిస్సిగ్గుగా వ్యాప్తి చేయడానికి రేడియో, టి.వి.లను ఉపయోగించుకుంటున్నారు. వీరిని ఎండగట్టే లౌకిక, ప్రజాస్వామిక పార్టీల నాయకులను, స్త్రీ సంఘాల నాయకులను, కార్మిక, విద్యార్థి, యువజన సంఘాల నాయకులను చంపడానికి హిట్ లిస్ట్ తయారుచేస్తున్నారు.

విప్లవ, ప్రజాస్వామిక ఉద్యమ కార్యకర్తలను విచారణ లేకుండా ఎంతో కాలం నిర్బంధిస్తూ చిత్ర హింసలు పెడుతున్న ప్రభుత్వాలు ఈ అరాచక హిందూ మూకను మాత్రం బహిరంగ బలవేదికలు నిర్మిస్తున్నారు. ప్రాథమిక హక్కులను తీసి చెత్త బుట్టలో పారేసిన ఈ అరాచక వాదులు రాజ్యాంగ సూత్రాలను రక్షించాలనుకున్న న్యాయ వాదులను, రాజ్యాంగ కోవిదులను బెదిరిస్తూ వారి నోరు మూశారు.

హిందూ మతోన్మాదుల ఉన్మత్త ప్రేలాపనలు హోరులో ప్రజాస్వామిక లౌకికవాదుల శాస్త్రీయ విజ్ఞాన విశ్లేషణలు వినబడకుండా పోతున్నాయి. వీళ్ళు ఈ విధమైన భయోత్పాతాన్ని సృష్టించి నాజీలకు నిజమైన వారసులమని బహిరంగంగానే చాటుకుంటున్నారు.

## నియంతృత్వానికి నైరాశ్యం పునాది

సనాతన హిందూ మత నియంతృత్వ వాదులకు ఇప్పుడున్న ప్రభుత్వాలు తమ మతాన్ని కొనసాగించవని నమ్మకం పోవడానికిగల ప్రధానమైన అంశం ఏమంటే వీళ్ళు ఓట్ల కోసం అప్పుడప్పుడు మైనారిటీలకు అనుకూలంగా వ్యవహరించటమే. అందుకే వీరు బాహాటంగా హిందూ

మతరాజ్య స్థాపనకు పూనుకున్నారు. ప్రజల్లో ఈ ప్రభుత్వాల ఎడల వస్తున్న నైరాశ్యాన్ని కూడా వారికి అనుకూలంగా మార్చుకుంటున్నారు.

## ప్రజల నైరాశ్య వాదానికి కారణాలు

1) కోర్టులపై నమ్మకం పోవటం 2) పోలీసుల అణిచివేత 3) అవిద్య, నిరుద్యోగం 4) రాజకీయ పార్టీల దగాకోరు విధానాలు. ఈ కారణాల ఆధారంగానే ప్రజల్లో నైరాశ్యావాదం పెరుగుతుంది. ఈ అసంతృప్తిని నైరాశ్యాని సొమ్ము చేసుకోవాలని హిందూ మతోన్మాదులు చూస్తున్నారు. కోర్టులు బాబ్రీ మసీదు వివాదాన్ని పరిష్కరించలేవని విశ్వహిందూ పరిషత్ బి.జె.పి. వాళ్ళుఅన్నప్పుడే వారికుట్రలు ప్రస్ఫుటమయ్యాయి. ముస్లిములతో ఈ పోలీసులు ఈ రాజ్యాంగ యంత్రం మిమ్మలను కాపాడలేవు. మా దయాదాక్షిణ్యాల మీదే మీరు ఆధారపడి బ్రతకగలరు అని వారిని బెదిరిస్తూ వచ్చారు.

మరొకప్రక్క హిందువులతో ఈ ప్రభుత్వం ముస్లిం ప్రక్కనే ఉందని మన ప్రక్కన లేదని చెపుతూ వారిని రెచ్చగొడుతూ వచ్చారు.

నైరాశ్య భావాన్ని రెండు ప్రక్కల కలిగించి హిందూ రాజ్య నిర్మాణమే మన కర్తవ్యం అని హిందూవులకు ప్రభోదిస్తూ, ముస్లిమ్‌లలో 'హిందువులకు లొంగి వుండక తప్పదు' అనే భావాన్ని పెంచుతూ ఈ వైరుధ్యాన్ని తమ కనుకూలంగా మల్చుకుంటున్నారు.

## మతోన్మాదుల ఎత్తుగడలు

హిందూ మతోన్మాదాన్ని ప్రభుత్వ యంత్రాంగంలోకి పూర్తిగా జొనపలేకపోతూన్న కాంగ్రె, జనతాదళ్ నాయకత్వంలోని నేషనల్ ఫ్రంట్ మీద కూడా బి.జె.పి. యుద్ధాన్ని ప్రకటించడమేకాక ఆయాసంస్థల నుండి తమకు అనుకూలమైన వర్గాన్ని చీల్చే విషయంలో కృతకృత్యమైంది.

కాశ్మీర్‌లో నేషనల్ కాన్ఫరెన్స్, పంజాబులో అకాలీదళ్‌వంటి మత మితవాద పార్టీలను పక్కకు పెట్టిన ముస్లిం ఉగ్రవాదులను, ఖలిస్థా

నాయులను ఎదురుగా నిలబెట్టి హిందూ మత సాయుధులతో తమ శక్తిని మరింతగా పెంచుకున్నారు.

మతాన్ని ఆయుధంగా చేసుకున్న మత మితవాద పార్టీలు కూడా ఈ సంక్షేమ రాజ్యంలో తమకంటు ఒక వర్గాన్ని సమీకరించుకోగలిగారు. హిందూ మత పిచ్చి ఉన్న వారిని సమీకరించి, కృత్రిమ జాతి సిద్ధాంతాన్ని బోధించి ఆయాపార్టీల్లో సంక్షోభాన్ని సృష్టించి చీలికలు తీసుకురాగలుగుతున్నారు.

హిందూ మతోన్మాదులు హిందూ పురాణాలలోను, కావ్యాల్లోను ఉన్న సాయుధ నాయకుల్ని, దేవతల్ని దేవుళ్ళని ప్రజలముందు నిలబెట్టి వారికున్న మత విశ్వాసాలను తమ మతోన్మాదానికి అనుకూలంగా మలుచుకోవటంలో కూడా వీరు సరికొత్త సాంస్కృతిక రూపాల్లో ప్రజల ముందుకు వెళ్ళుతున్నారు.

భారతదేశ వ్యాపితంగా ఆయాప్రాంతాలలో ప్రజల నమ్మకాలను కొల్లగొట్టడానికి ఆయా దేవుళ్ళను మరి ముఖ్యంగా ప॥బెంగాల్లో కాళికా దేవిని, మహారాష్ట్రలో గణపతిని, శివాజినీ, హైదాబాద్‌లో గణపతిని, ఉత్తర భారతదేశంలో రాముణ్ణి వారు ముందుకు తీసుకువచ్చి, అభూత కథల్ని వారి మీద ప్రచారంచేసి వీరి మత మూర్ఖసేనలోకి ఎక్కువ మందిని సమీకరించ గలుగుతున్నారు.

## మతోన్మాదులకు గుత్త పెట్టుబడిదారుల అండ

గుత్త పెట్టుబడిదారుల మధ్యనున్న శతృత్వాలు, హిందూ మతోన్మాదులు తమ స్థానాన్ని మరింత బలపర్చుకోవడానికి ఉపయోగపడ్డాయి. 1984 సంవత్సరం వరకు గుత్త పెట్టుబడిదారీ వర్గం కాంగ్రెస్ తోనే ఉన్నదనేది బహిరంగ రహస్యమే. రాజీవ్ గాంధీ హయాంలో

ఆధునిక గుత్తపెట్టుబడిదారీ వర్గం మరింత బలపడుట వలన వారికి పాత గుత్తపెట్టుబడిదారీ వర్గానికి గతంలో ఎన్నడూ జరగని విధంగా ఘర్షణలకు బీజాలుపడ్డాయి. లైసెన్సులు సంపాదించడం, దిగుమతులపై పన్నులు తగ్గించడం, కస్టమ్స్ పన్నులు లేకుండా యంత్రసామాగ్రి దిగుమతుల విషయాలలో ప్రభుత్వ ఉత్తర్వులు అతిక్రమించడం, ప్రత్యర్ధి పారిశ్రామికవేత్తలను అణగద్రొక్కాలని ప్రయత్నించడం, భూచట్టాలను అతిక్రమించడం, అధికారులను పత్రికలను కొనివేయడం, పరస్పరం చంపుకొనే ప్రయత్నాలు చేయడం (ఉదా॥ బాంబేడయింగ్‌కు చెందిన నుస్లీవాడియాపై, రిలయన్స్ గ్రూపుకు చెందిన ధీరుభాయి అంబాని హత్యాప్రయత్నం చేయడం) వంటి పనులతో ఆధునిక గుత్తపెట్టుబడిదారులు ఆయారంగాల్లోని పాత గుత్త పెట్టుబడిదారులతో పోటీకి నిలిచారు. ఆధునిక పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేక శక్తిగా నిలిచిన వి.పి. సింగ్ ద్వారా కాంగ్రెస్‌లో వచ్చిన చీలికను, గుత్తపెట్టుబడిదారుల మధ్య ఉన్న వైరుధ్యాలను బి.జె.పి. తమకు అనుకూలంగా ఉపయోగించుకొని, బలపడటానికి ప్రయత్నించారు.

అద్వానీ రథయాత్రను అంబానీలే ఏర్పాటుచేయటానికి, నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వ పతనానికి కోట్ల రూపాయలతో యం.పి.లను కొని చంద్రశేఖర్‌కు సహాయపడటానికి మధ్యవున్న అంతరంగ సంబంధాలను పరిశీలిస్తే వీరి వ్యాపారాలకు అనుకూలంగా ఉండేటట్లయితే, వీరు హిందూ ఫాసిజానికి కూడా వెనుకాడరని అర్ధం చేసుకోవచ్చు.

హిందూ రాజ్యం అనేది మతరాజ్యం (పూజారి వర్గంచే పరిపాలించబడే రాజ్యం) కాదని చెప్పటంద్వారా తమ రాజ్యంలో రిజర్వ్ బ్యాంక్, ప్రణాళికా విభాగం, రాజ్యాంగ యంత్రాన్ని నియంత్రించేది శంకరాచార్యులు, సాధువులు, భజరంగ్‌దళ్ వంటి ఉన్మాద నాయకులు కాక, ఈ పారిశ్రామిక వేత్తలకే ఆ హక్కు ఉండగలదని అద్వానీ వారికి హామీనిస్తున్నాడు.

ప్రస్తుతం గుత్త పెట్టుబడిదారీ వర్గంలోని వ్యతిరేక శక్తులు తమకు అండగా నిలవకపోతే తమ రాజ్యస్థాపన దెబ్బతింటుందని మతోన్మాదులు దూరదృష్టితోనే ఆలోచించారు. ద్రవ్యోల్బణం, అధిక ధరలు, లక్ష కోట్ల రూపాయలు దాటుతున్న విదేశీ అప్పులు, కోట్లాది మంది నిరుద్యోగులు, లాకౌట్లు, లే-ఆఫ్‌లు, చమురు సంక్షోభాలు తదితర సమస్యల నుండి ఉద్భవిస్తున్న శ్రామిక, ప్రజా ఉద్యమాలను అణిచివేయ గలిగిన, ప్రజలను మభ్యపెట్టగలిగిన మత తత్వ పార్టీల వైపే ఈ గుత్త పెట్టుబడిదారులు మొగ్గు చూపారు.

ఈ ప్రమాదాన్ని వివరిస్తూ జస్టిస్ వి.ఆర్. కృష్ణఅయ్యర్ ఇలా అన్నారు

"మతవాదపు మన రాజకీయాలు సజాతీయం చేయబడిన మన మానవతా వాదాన్ని, సాంఘిక-ఆర్థిక న్యాయన్ని, ఆధ్యాత్మిక-భౌతిక వాదాల సమన్వయాన్ని, క్రైమ్ చేస్తూ ఉండగా మన రాజ్యాంగపు మతాతీత లౌకిక విధానం దాని మహనీయ సూక్తులలో, ప్రబోధాత్మక వాక్యాలతో ముద్రించబడ్డ గ్రంథంవలె అలా ఒకచోటపడి నిద్రపోతూ ఉంటుంది. ఈనాడు ఖురాను, గురుగ్రంథ సాహెబ్, వేదాలూ పీకలు కోసే రాజకీయాలను ప్రచారం చేయడానికే ఉపయోగించబడుతున్నాయి. ఈ పద్ధతిని మనం వెనక్కు మళ్ళించి ఈ దేవుళ్లూ దేవతల దౌష్ట్యాకాన్ని బకాయింపునూ బహిర్గతం చేస్తేతప్ప, మనం బతికి బట్టకట్టలేము. లౌకిక క్రియాశీలత సోషలిస్టు మానవతావాదం ఇవి రెండూ ఇప్పుడు రాజ్యాంగ విజయానికై పోరాటం సల్పాలి."[1]

ఇదే విషయాన్ని ధృవపరుస్తూ హిరేన్ ముఖర్జీ ఇలా వ్యాఖ్యానించారు

"ఒక పెద్ద మనిషి అన్నట్టు మనకు యాజ్ఞ వల్క్యంనుండి వివేకానందా వరకూ అందరూ చెప్పిన. బోధనలవల్ల పూర్తిగా అజీర్తి చేసింది. అది మితిమీరింది. అందుకే మన అధ్యాత్మికవాదం ఆత్మ

---

1 యోజన 1985 ఆగష్టు 15 ప్రత్యేక సంచిక నుండి



రిజర్వేషన్లు—

నాశనకరమైన భ్రమల నుంచి మనిషిని కాపాడలేకపోతుంది. మన మేధా దారిద్ర్యం అధ్యాత్మిక హీనత్వం ప్రతి అడ్డమైనవాడి ముందూ, అంటే తాము పవిత్రులమని, దైవ సమానులమని చెప్పుకొనే 'బాబాల' ముందు నిర్హేతుకంగా నీచంగా సాష్టాంగపడేలా చేస్తోంది..........ఘోర మైన అణచివేత, పరమత విద్వేషాన్ని, మారణహోమం, దమనకాండ, దోపిడీలు, హత్యలు ఎన్నో మతం నీడలోనే, మతం పేరుతోనే చరిత్ర పుటలను రక్తపుటేరులతో ముంచెత్తాయి. చరిత్రను ఒక్కసారి తవ్వితే స్తే నాటి సంఘటనలు మనల్ని భయభ్రాంతుల్ని చేస్తాయి."[1]

ఈ మతవాద సంస్కృతిని కాపాడ్డంలోనూ, పెంచిపోషించటం లోనూ బుద్ధిజీవులు తమవంతు పాత్రను నిర్వహిస్తున్నారు. ఈ పున రుద్ధరణ వాదులు తాతలనాటి భావాలకు వారసులుగా కుల, మత సంస్కృతీ పునాదులను చెక్కుచెదరకుండా కాపాడుతుంటారు. ఈనాటి శాస్త్ర విజ్ఞానమంతా మత గ్రంథాలనుండే ఉత్పన్నమైనట్లు భేషజాలు పలుకుతుంటారు. ఒక రకంగా ఈ హిందూ మతోన్మాదం పెరగడానికి పునాదులు వీళ్లే. వీరి పునరుద్ధరణవాదాన్ని ప్రమాదాన్ని గురించి జస్టిస్ ఒ. చిన్నపరెడ్డి ఇలా వివరిస్తున్నారు.

"ఈ విద్యావేత్తలు, మేధావులు, మార్గదర్శకులుగా వ్యవహ రించడానికి బదులుగా విజ్ఞానశాస్త్రపు వీరోచిత పైతాళికులుగా చలామణీ అవుతూ - సంప్రదాయాలనూ, మూఢవిశ్వాసాలనూ సంరక్షించే వారుగా తయారయ్యారు. ఉక్కు ఫ్యాక్టరీలకూ, న్యూక్లియర్ స్టేషన్లకూ, స్పేస్ పరిశోధనాలయాలకు శంకుస్థాపన ఉత్సవాలు, శాస్త్రోక్తంగా బ్రాహ్మణ పురోహితుని మంత్రోచ్ఛాటనతో, సుముహూర్తంలో జరుగుతున్నాయి. ఈ సుముహూర్తాన్ని పండితులూ, జ్యోతిశాస్త్రవేత్తలూ నిర్ణయిస్తారు. దేశమంతా స్వామీజీలతోనూ, బాబాలతోనూ, భగవాన్లతోనూ, మహర్షుల

---

1 యోజన 1985 ఆగష్టు 15 ప్రత్యేక సంచిక నుండి

తోనూ, యోగులతోనూ, ఇంకా అనేకమైన దేవుని ఏజెంట్లతోనూ లుకలుక లాడుతూ వుంది. వీరివద్దకు ప్రజలు వెతుక్కుంటూ వెళ్తున్నారు. అక్షరాస్యులూ, నిరక్షరాస్యులూ, పేదవారూ, ధనికులూ, మంత్రులూ, జడ్జీలు, రాజకీయవేత్తలు, ఉన్నతోద్యోగులూ, ప్రొఫెసర్లూ, సైంటిస్టులుగా పిలువబడేవారూ దేవుని ఏజెంట్ల దర్శనానికై ఎగబడుతున్నారు. వారి కాళ్లపై సాష్టాంగ దండ ప్రమాణాలు చేస్తున్నారు. వారిచ్చే విభూదో లేక జ్ఞాపకచిహ్నాలో, తాయెత్తులో ధరించి భౌతికంగా ప్రాపంచిక విషయాల్లో అభివృద్ధి సాధించగలమనే నమ్ముతున్నారు. సమాజంలోని శ్లిష్టజనమూ, నిరక్షరాస్యులూ, పోటీపడి పంచాంగాలనీ, హస్తసాముద్రికులనూ, జ్యోతిశాస్త్రవేత్తలనూ, మంత్ర, తంత్రవేత్తలనూ, 'దైవిక శక్తికలవారి'ని సంప్రదిస్తున్నారు.

పేరు ప్రఖ్యాతులున్న దైవాలనూ, చిల్లరదేవుళ్లనూ, దేవతలను ప్రసన్నం చేసుకోవడానికీ, వారి అనుగ్రహం సంపాదించడానికీ, మొక్కుబడులు తీర్చడానికీ, దేవాలయాలకూ, యాత్రా స్థలాలకూ వెళ్లే ప్రజల సంఖ్య అసంఖ్యాకంగా వుంది. ఎన్నికలలో గెలుపు సాధించాలన్నా మంత్రి పదవి కావాలన్నా, నల్లబజారు వ్యాపారంలో లాభాలు గడించాలన్నా, కోర్టులో కేసు గెలవాలన్నా, కూతురికి మంచి భర్త కావాలన్నా తిరుపతికి హుటాహుటి బయలుదేరడమే. అక్కడ పన్నులు కట్టకుండా ఎగేసిన ఆదాయాన్ని హుండీలో పడేసి, పన్ను మినహాయింపు సౌకర్యాలను పొందవచ్చు. మదరాసు నుంచి వస్తున్న 'ది హిందూ' పత్రిక తప్ప, దేశంలోని అన్ని జాతీయ వార్తా పత్రికలూ ప్రతి ఆదివారం 'వారఫలాలు' ప్రచురిస్తున్నాయి. అయితే ఆ లోటు భర్తీ చేసుకోడానికి 'ది హిందూ' పత్రిక ఆఖరు పేజీలో రోజూ ఒక మత విషయిక ఉపన్యాసాన్ని క్లుప్తంగా ప్రచురిస్తోంది!

'భారతీయ సంస్కృతి' పేరిట ఈనాడు యోగశాస్త్రం, వేదాంతం, గీతోపదేశం. అద్వైతం, అతీతధ్యానం మొదలగు



రిజర్వేషన్లు—

అంతులేని ప్రచారం సాగుతోంది ఏ పుస్తకాల షాపు కెళ్ళినా ఈనాడు యోగశాస్త్రం మీద, వేదాంతం మీద అసంఖ్యాకంగా పుస్తకాలు దొరుకుతాయి. అంతేకాదు జ్యోతి శాస్త్రంపై, హస్తసాముద్రికంపై, లైంగిక విజ్ఞానాలపై వైవాహిక సమస్యలపై, కామసూత్రాలపై పుస్తకాలు, హెరల్డ్ రాబిన్స్ నవలలా కనపడతాయి. సంస్కృతం అధికార భాషగా చేయాలనీ, సంస్కృత విశ్వవిద్యాలయం ప్రారంభించాలనీ ఒక డిమాండ్‌కూడా ఉంది. ఈ దురభిమానులు ఇప్పటికే కొంత విజయం సాధించారు. అదే ఆకాశవాణిలో సంస్కృత వార్తాప్రసారం ప్రారంభించడం. దేశంలోని శ్లిష్టవర్గానికీ, ఉన్నత విద్యావంతులకూ సంబంధించి జరుగుతున్న పునరుద్ధరణ వాదానికి చెందిన వివిధ రూపాలే ఇవన్నీ" *

జస్టిస్ చిన్నపరెడ్డిగారు హిందూ పునరుద్ధరణవాదం మీద సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో భాగంగా ఆయనవంతు పాత్రను నిర్వహిస్తున్న న్యాయకోవిదుడు. ఈనాడు ముంచుకొచ్చిన ఈ ప్రమాదాన్ని గూర్చి ఆయన ఒక దశాబ్దం ముందునుండే హెచ్చరిస్తూ వస్తున్నారు. నిజానికి లెనిన్‌కూడా రాజ్యానికి మతానికి సంబంధం వుండకూడదని మతం వ్యక్తిగత వ్యవహారంగా వుండాలని వివరించారు.

"మతాన్ని ఒక వ్యక్తిగత వ్యవహారంగా తప్పక ప్రకటించాలి. ఈ మాటలలో సోషలిస్టులు మతం పట్ల తమ దృక్పథాన్ని వ్యక్తపరుస్తారు. ఐతే, ఏలాంటి దురవగాహన, అపార్థం చేసుకోకుండా వుండేందులకై ఈ మాటల యొక్క అర్థాన్ని స్పష్టంగా, ఖచ్చితంగా నిర్వచించుకోవాలి. ప్రభుత్వానికి సంబంధించినంతవరకూ మతాన్ని వ్యక్తిగత వ్యవహారంగా మనం ఎంతమాత్రం ఏ విధంగానూ పరిగణించలేము. మతం ఏ మాత్రం రాజ్యాంగ యంత్రానికి (స్టేట్) సంబంధించినదిగా వుండకూడదు. తనకు

---

* పునరుద్ధరణవాద ప్రతిఘటన వర్గపోరాటంలో భాగంగా సాగాలి.
జస్టిస్ ఒ. చిన్నపరెడ్డి

ఇష్టమొచ్చిన మతాన్నిగానీ, లేక ఏ విధమైన మతరాహిత్యాన్ని అంటే నాస్తికత్వాన్నిగానీ ప్రబోధించే పరిపూర్ణమైన స్వేచ్ఛ తప్పక ప్రతి వానికి ఉండాలి. నియమం ప్రకారం ప్రతి సోషలిస్టూ నాస్తికుడే (వక్కాణింపు అనువాదకునివి). తమతమ మత విశ్వాసాల కారణంగా పౌరుల మధ్య విచక్షణ పాటించడం ఏ మాత్రం సహించరానిది. ఒక పౌరుని యొక్క మతాన్ని ప్రభుత్వ పత్రాల్లో (రికార్డులలో) పట్టిగా పేర్కొన టాన్ని కూడా నిర్ద్వందంగా తొలగించివేయాలి. సుస్థాపితమైన చర్చికి ఏలాంటి ద్రవ్యసహాయం, రాయితీ (సబ్సిడీ) లను ఏ మాత్రం ప్రభుత్వం మంజూరు చేయకూడదు. చర్చి పురోహిత వర్గానికీ, మత సంస్థలకు ఏలాంటి ప్రభుత్వ సహాయం (అలవెన్సులు) అందచేయకూడదు. ఇవి ఏకాభిప్రాయంగల పౌరులయొక్క సంపూర్ణ స్వేచ్ఛగల్గిన సంఘాలు లేక సంస్థలుగా తయారుకావాలి. ఇవి రాజ్యాంగ యంత్రం (స్టేట్) తో ఎలాంటి సంబంధంలేని సంస్థలుగా రూపొందాలి. కేవలం ఈ కోర్కెలు (డిమాండ్లు) పరిపూర్ణంగా నెరవేరినప్పుడే అవమాన భరితమైన శాపగ్రస్థమైన గతానికి తెరవేయుటం జరుగుతుంది." *

అంటూ సోషలిస్టు రాజ్యం వచ్చిన తరువాతకూడా మతంగూర్చి తీసుకోవలసిన జాగ్రత్తల గూర్చి లెనిన్ విశ్లేషించాడు.

భారతదేశంలో మానవతావాదులందరూ ఈ ఘోరకలిని తమ వంతు పాత్రగా వ్యాఖ్యానించారు. కాని మతవాదాన్ని పునాదులతో పెకల్చగలిగిన భౌతిక వాదాన్ని ప్రచారం చేయడంలో, భౌతికవాద ఉద్యమం నడపడంలో కమ్యూనిస్టు ఉద్యమం విఫలమయ్యింది. అందుకే భారతదేశానికి ఈ ప్రమాదకర పరిస్థితులు వచ్చాయి.

---

* సోషలిజం - మతం — లెనిన్

కమ్యూనిస్టులు ముఖ్యంగా ఆర్థిక సమతే అన్నింటికి పరిష్కారము అని భాష్యం చెపుతూ మత ఉన్మాద ఉద్యమాలకు వ్యతిరేక భౌతికవాద ఉద్యమాన్ని, భౌతికవాదం పునాదిగా కలిగిన హేతువాద ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళటంలో విఫలమైనారు. దాని ఫలితంగా కమ్యూనిస్టు కార్యాలయాలమీద మతోన్మాదులు దాడిచేసే స్థితికి, ఆ దాడుల నుండి తమనుతాము రక్షించుకోలేనిస్థితికి కమ్యూనిస్టు ఉద్యమం ఈనాడు నెట్టబడింది."

()—()

# మతోన్మాదులపై తిరుగుబాటు ఉద్యమం

మతోన్మాదులు వారు బోధిస్తున్న అరాచక హిందూ మతోన్మాదమే ఈనాడు దేశం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలకు పరిష్కార మార్గం చూపించగలదని ప్రచారం చేస్తున్నారు. 'అర్థికాంశము' ప్రధానంగా రాజకీయోద్యమాన్ని నడుపుతున్న కమ్యూనిష్టులు మతోన్మాద ఉద్యమాన్ని ఎదుర్కొవటంలో విఫలమయ్యారు. చార్వాకులు లోకాయతులు ప్రతిపాదించిన భౌతికవాదఉద్యమాన్ని వీరు పూర్తిగా నిర్లక్ష్యం చేయటం వలన కమ్యూనిస్టు ఉద్యమంలో కూడా భావవాద ధోరణులు ప్రబలినాయి.

నిజానికి మార్క్సు ఏంగెల్సులు మతం ప్రమాదాన్ని అనేక సందర్భాల్లో నొక్కి చెబుతూ భౌతికవాదం ఒక ఉద్యమంగా నడవాలని చెప్పారు. కొన్ని సందర్భాల్లో మతం ఒక ప్రమాదకరమైన శక్తిగా ముందుకు వచ్చినపుడు భౌతికవాద భూమిక మీద దాన్ని ఎదుర్కొనాలి.

ఏంగెల్స్, జోసఫ్ బ్లాక్‌కు 1820, సెప్టెంబర్ 21న వ్రాసిన లేఖలో ఇలా వివరించారు.

"According to the materialist conception of history the determining element in history is ultimately the production and reproduction in red life. More than their neither Marx nor I have ever asserted. If therefore somebody truists this into the statement that the economic element is the only determining one he transforms it into a meaningless, abstract and absurd phrase........ political, legal, philosoyhical theories religious views and their development into systems of dogmas also exercise their influence upon the course of the historical struggles and in many cases determine their form in particular."

చారిత్రతిక భౌతికవాదం ప్రకారం వాస్తవిక జీవితంలోని ఉత్పత్తి పునరుత్పత్తి చివరగా నిర్ణాయకశక్తి అవుతుంది. మార్క్స్ గాని నేనుగాని అంతకుమించి ఏమీ చెప్పలేదు. అందువల్ల దీనికి ఎవరైనా ఆర్థిక అంశం ఒక్కటే నిర్ణాయకశక్తి అని అర్థంతీస్తే దాన్ని అర్థరహితమైన శుష్కసమాజంగా మార్చివేసినవారవుతారు. రాజకీయ, న్యాయ, తాత్విక సిద్ధాంతాలు. మత దృక్పథాలు వాటి మీద నుంచి వచ్చిన ఆలోచనా విధానాలుకూడా చారిత్రిక పోరాటాలమీద వాటి ప్రభావాన్ని చూపుతాయి. చాలా సందర్భాల్లో ప్రత్యేకంగా వాటి స్వరూపాన్ని నిర్ణయిస్తాయి." [1]

ఏంగెల్సు ప్రతిపాదనని ముందుకు తీసుకుపోవాలని చెబుతూ భారతనాస్తిక సమాజం ప్రధాన కార్యదర్శి శ్రీ బి. రామకృష్ణగారు "సామాజిక సమస్యల్ని పరిష్కరించటంలో ఆర్థికతా ప్రాకారాలపై ఆధారపడ్డ వర్గదృక్పథం ఎంతవరకు ఉపకరిస్తుందో అదిమేము చెప్పటం కంటే పైన చెప్పినట్లుగా మార్క్సు, ఎంగెల్సుల ఆలోచనలో వచ్చిన మార్పువల్ల మీరే తెలుసుకోవచ్చు" అని వ్యాఖ్యానించారు. [2]

ఈ సమస్యమీద నాస్తిక, హేతువాద, అంబేద్కర్ ఉద్యమాలకు - కమ్యూనిస్టు ఉద్యమాలకు మధ్య పెద్దచర్చ జరుగుతూనే ఉంది.

అసలు లోకాయత ఉద్యమంలో వర్గ దృక్పథం వుంది. భారతదేశంలో ఆర్యులురాకముందు. హిందూమత భావన ప్రవేశించక ముందే భౌతికవాద ఉద్యమాన్ని లోకాయతులు నడిపారు. ఈ ఉద్యమం పాలక వర్గాలకు వ్యతిరేకంగా నడిచిన ఉద్యమం. ఈ విషయాన్ని సత్యకామ జాబాలిలో సి.వి. ఇలా ప్రతిపాదించారు.

---

[1, 2] అరెరె! రంగనాయకమ్మగారూ! మీకు నాస్తికత్వం తెలుసా!!
— రామకృష్ణ

"లోకాయత ఉద్యమం పాలకుల ఉద్యమం కాదు. పాలితుల ఉద్యమం. ఇది భూస్వాముల ఉద్యమంకాదు. పాలికాపుల ఉద్యమం. ఇది విజేతల ఉద్యమం కాదు - పరాజితుల ఉద్యమం. ఇది బానిస యజమానుల ఉద్యమం కాదు - బానిసల ఉద్యమం. ఇది యావత్ నిష్టదరిద్రుల, సంఘ బహిష్కృతుల ఉద్యమం. ఒక్క మాటలో నాటి యావత్ కష్టజీవుల సాంస్కృతిక-సాంఘిక విప్లవమే లోకాయత మహోద్యమం........" [1]

లోకాయత ఉద్యమాన్ని నడిపిన దళితులు హిందూ మత రాజ్యాన్ని మొదటి నుండి ఎదిరించినవారు. ఈ నాటికీ గిరిజనులు, అస్పృశ్యులు హిందూ సామాజిక జీవితానికి దూరంగా జీవిస్తున్నారు. వెనుకబడిన కులాలవారు హిందూ సామాజిక అణచివేతలో బాధితులుగా, గిరిజనులతో అస్పృశ్యులతో మమేకం అవుతున్నారు. హిందూ మత అణచివేతల్లో ఆయాకాలాల్లో ఎంతోపీడనకు గురైన మైనారిటీ మతాలవారు వీరితో ఏకమై పోరాటానికి పూనుకుంటూన్నారు.

ఇక కమ్యూనిస్టు ఉద్యమాల్లో ఉండే భౌతికవాద ధృక్పథం కలిగినవారు., వీరితో వస్తున్నారు. కమ్యూనిస్టుల్లో ఉండే భావవాదులు మత సామరస్య వాదాన్ని ముందుకు తీసుకువచ్చి గతితర్కిక చారిత్రిక భౌతికవాద ధృక్పథాన్ని నీరుకార్చే ప్రయత్నం చేస్తున్నారు. సిద్ధాంతం మీద నిలబడకుండా వారు ఇలా వ్యవహరించడానికి కారణం హిందువుల ఓట్లు ఒకవేళ వారికి పడవేమోననే అనుమానం. గతంలో కూడా కాంగ్రెస్ ను వ్యతిరేకించడానికికని పేరుపెట్టి బి. జె. పి. తో ఫ్రంటు కట్టిన పార్టీల ఉదార వాదం వల్ల కూడా మతోన్మాదులు బలం పుంజుకున్నారు.

1 సత్యకామ జాబాలి తొలిపలుకులు 22వ పేజీ - రచన సి. వి.

దళిత బలహీన మైనారిటీ వర్గాల ప్రజలు లోకాయత భౌతిక వాదం పునాదిగా హిందూ మతోన్మాదుల పునాదులు కూలిపోయేసాంస్కృతిక విప్లవోద్యమాన్ని శక్తివంతంగా ముందుకు తీసుకుపోవడం ద్వారానే ఈ దేశాన్ని రక్షించుకోగలుగుతాం.

## సాంస్కృతిక విప్లవోద్యమం కార్యక్రమం

1 హిందూ మతం పునాదుల మీద వున్న రాజ్యభావనను వ్యతిరేకించాలి.

2 'హిందూ సంస్కృతికాదు మనది వ్యవసాయ' సంస్కృతా అని ప్రతిపాదించి, వ్యవసాయ సంస్కృతికి, వ్యవసాయ విప్లవానికి వున్న కార్యకారణ సంబంధంతో ముందుకెళ్ళాలి.

3 **ST, SC, BC,** మైనారిటీ శక్తుల్ని ఐక్యం చేసి వారితో కలిసి వచ్చేఅగ్రకులాల్లోని ప్రజాస్వామిక లౌకిక వాదులతో కలిసి హిందూ రాజ్యస్థాపనకు కృషి చేస్తున్న **RSS, VHP, BJP,** శివసేన, భజరంగ్ దళ్‌వంటి మతోన్మాద, ఫాసిస్టు శక్తుల కూటమికే వ్యతిరేకంగా 'ఐక్యసంఘటన' నిర్మించాలి.

4 హిందూ మతేతరమైన భౌతిక సామాజిక ఉద్యమాల సాహిత్యాలను, కళారూపాలను సాంస్కృతిక విప్లవాన్ని విజయవంతం చేసే క్రమంలో వ్యాప్తిలోకి తీసుకెళ్ళాలి.

5 భారత దేశంలో నివసిస్తున్న పీడిత ప్రజలు హిందూమతేతర జాతులకు సంబంధించిన వారనే చారిత్రక సత్యాలను ప్రజల్లోకి తీసుకు వెళ్ళాలి.

6 భారత సామాజిక విప్లవకారులైన డా॥ బి. ఆర్. అంబేడ్కర్ మహాత్మా పూలె, పెరియార్ వంటి ఉద్యమకారుల భావాలను, అదే క్రమం లో ప్రాచీన భారతీయ భౌతిక వాదులైన చార్వాక, లోకాయత. సామాజిక బౌద్ధుల భావాలను ప్రచారంలోకి తీసుకువెళ్ళాలి.

7 మార్క్స్, ఏంగెల్స్ ప్రతిపాదించిన గతితార్కిక చారిత్రిక భౌతికవాద సూత్రాలను భారతీయ సామాజిక పరిస్థితులకు అన్వయించి ముందుకు తీసుకువెళ్ళాలి.

8 మత వ్యవస్థల వెనుక నున్న సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడి దారీ సంస్థల గుట్టురట్టు చేసి మత, రాజకీయ వ్యవస్థలకు వ్యతిరేకంగా శ్రామిక శక్తుల పోరాటాన్ని ముందుకు తీసుకెళ్ళాలి.

9 హిందూ రాజ్యానికి వ్యతిరేకంగా దళిత బలహీనమైనారిటీవర్గాలైన పీడితుల రాజ్యనిర్మాణం కోసం ఐక్యపోరాటం చేయాలి.

